


అరుణాచల జ్యోతి యోగి రామ్ సురతక్కుమార్

యోగిరామ్ సురత్కుమార్ యోగిరామ్ సురత్కుమార్ యోగిరామ్ సురత్కుమార్ జయ గురురాయా
దైవానుభూతి అంటే ఏమిటో తెలియని పామరులు కూడా అరుణాచల ఆశ్రమంలోకి ప్రవేశించిన వెంటనే ఆ దైవానుభూతిని ఆస్వాదించేలా నా తండ్రి ఈ ఆశ్రమాన్ని నిర్మించారు.

[ తెలుగు సేత : కొండూరు వెంకటేశ్వర్లు

మీకు దుఃఖం కలిగినప్పుడు ఈ బిచ్చగాని పేరును స్మరించండి. నా తండ్రి తక్షణం పరుగెత్తుకువచ్చి మీకు సాయం చేస్తారు. ఆ తండ్రి నాకిచ్చిన వాగ్దానం ఇది.

అరుణాచల ఆశ్రమంలోనికి ప్రవేశించిన ఎవరు గానీ ఖాళీ చేతులతో తిరిగివెళ్ళరు. నా తండ్రి అనుగ్రహం వారిపై వర్షంలా కురుస్తుంది. వారు దీనిని గ్రహించినా, గ్రహించకున్నా ఇది వాస్తవం.

యోగిరామ్ సురత్కుమార్ జయ గురురాయా

## అరుణాచల జ్యోతి యోగిరామ్ సురత్కుమార్

మనమందరమూ బిచ్చగాళ్ళమే. తలిదండ్రుల భిక్షతోనే జన్మించాము. ఆ తండ్రి ఇచ్చిన భిక్షతోనే పెరిగాము. గురువుగారైన ఉపాధ్యాయుని అనుగ్రహ భిక్షతోనే జ్ఞానం పొందాము. ఎవరైనా గానీ ఈ వాస్తవా లను ఎప్పుడూ గ్రహించడం లేదు.

అది మాత్రమే కాదు, ధనం, విద్య, పదవి లాంటివి మనకు చేకూరినప్పుడు మనం ఉన్నతస్థాయిలో వున్నట్లు, మనమే యజమానులం అని పొంగిపోవడం అలవాటయి పోయింది.

కానీ ఒక అద్భుత జ్ఞాని "బిచ్చగాడు... పాపి... ఉన్మాది" అని తనను తాను కించపరచుకునేవారు. అలాంటి అరుదైన యోగి తిరువణ్ణామలైలో జీవించి సిద్ధి చెందిన యోగి రామ్ సురత్కుమార్.

"వినయమే ఎదుగుదలకు సంకేతం" అనే సూక్తికి తగినట్లు జీవించిన మహాపురుషుని భక్తులు 'విసనకర్ర స్వామి' అని ప్రేమగా పిలుచుకుంటారు.

భౌతిక విషయాలలో మునిగి తేలే కొందరికి ఆయన ఉన్మత్తత గలవారుగా, మరికొందరికి అర్థంకాని మర్మయోగిగా కనిపించేవారు. అయితే సహృదయులకు మాత్రం మానవీయత రూపు దిద్దుకున్న మహనీయుడు గానూ ఆయన దర్శనమిచ్చారు. అజ్ఞానులకు ఆయన సంప్రదాయాల ప్రతిబింబమైతే, జ్ఞానులకు సంప్రదాయా లను అధిగమించిన సంపూర్ణ జ్యోతి!

మనస్ఫూర్తిగా ఆయన జీవన చరిత్రను చదివే వారి హృదయాలను ఆయన పులకరింపచేస్తారు.

'జంతూనాం నరజన్మ దుర్లభం' అని మానవజన్మ నెత్తడం ఎంతో పూర్వజన్మ సుకృతం అని మన ప్రాచీనులు పేర్కొన్నారు. జ్ఞానం పొందడానికి విసనకర్రస్వామి పడిన శ్రమ గురించి మనం ఎంత గొప్పగా చెప్పినా ఈ మానవ జన్మ అనేది వద్దనే వద్దనిపిస్తుంది.

ఉత్తరప్రదేశంలో గంగానదీ తీరంలో వెలసిన ఒక చిన్న గ్రామం నర్దారా. ఆ గ్రామంలో రామదత్ కున్వర్ అనే ఒక రైతు ఉండేవాడు.

ఆయనకు గంగానదీ తీరంలో ముప్పై ఎకరాలకు తక్కువ కాకుండా పెద్ద భూమి ఉండేది. ఆయన భార్య కుసుమ్ దేవి.

ఈ దంపతులకు ముగ్గురు కుమారులు. పెద్ద కుమారుని పేరు మనార్కన్ కున్వర్, రెండవ కుమారుడు రామ్ సూరత్కున్వర్, మూడవ కుమారుడు రామదహీన్ కున్వర్.

01.12.1918 న ఈ దంపతులకు పుట్టిన రెండవ కుమారుడే రామ్సురత్కున్వర్. ఈ మాటకు అర్థం 'రామునిపట్ల ప్రేమగలవాడు' అని. సార్థకనామధేయుడైన అతనికి చిన్న వయసునుండే భక్తి భావాలు అంకురించాయి.

రామ్కురుత్కున్వర్కు తన తండ్రి చేస్తూ వున్న వ్యవసాయంలోగానీ, పశువులను మేపడంలో గాని ఆసక్తి లేదు. తమ గ్రామానికి సమీపంలో ప్రవహించే గంగానది అంటే మక్కువ ఎక్కువ. ప్రత్యేక ఆకర్షణ.

చిన్న వయసునుండే గంగా తీరంలో కూర్చుని వేగంగా ప్రవహిస్తున్న నదిని చూస్తూ వుండడం రామ్సురత్కు చాలా ఇష్టం.

విద్యాభ్యాసం చేయవలసిన వయసు వచ్చేసరికి తలిదండ్రులు అతడిని గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో చేర్చారు.

రోజూ తెల్లవారుఝామున నిద్రలేవగానే రామ్ సురత్ నదీ తీరానికి వెళ్ళేవాడు. కాలకృత్యాలు పూర్తికాగానే గంగానదిలో స్నానం చేసి, చాలాసేపు అక్కడ ఈత కొట్టేవాడు. తరువాత తీరానికి వచ్చి అడవిపూలను సేకరించుకుని గ్రామ పొలిమేరలలో వుండే చిన్న చిన్న దేవాలయాలలో కొలువై ఉన్న దేవతలపాదాలపై వాటిని సమర్పించి నమస్కరించుకునేవారు.

తరువాత ఇంటికి వెళ్ళేవాడు. అక్కడ తల్లి చేసిన రొట్టెలను, వాటిని నంజుకోవడానికి వున్న పదార్థాలతో కలిపి ఆరగించేవాడు. ఆ పూజా పునస్కారాలు ఏమున్నా రామ్సురత్కున్వర్ చదువులో కూడా గట్టివాడే!

సాయంత్రం ఇంటికి తిరిగిరాగానే పుస్తకాల సంచిని విసిరి పడేసి మరలా గంగానదీ తీరానికి వెళ్ళి అక్కడ కూర్చొని నదీ సౌందర్యాన్ని చూస్తూ ఆస్వాదించే వాడు.

ఆ రోజుల్లో భారతదేశపు నలుమూలల నుండీ వచ్చే సాధువులు, సన్న్యాసులు హిమాలయాల నుండి గంగాతీరానికి ప్రవాహంలా నడిచి వచ్చి, కలకత్తా సమీ పంలో గంగ ముఖద్వారంలో పడవలు ఎక్కి గంగకు మరువైపు దిరిగి మరలా హిమాలయాల వైపు సాగిపోయే వారు.

దాదాపుగా ఎనిమిదివేల కిలోమీటర్ల దూరం వారు నడచిపోయేవారు. వారి పాదయాత్ర అలా సాగిపోయేది. ఇలా నడిచిపోవడానికి వారికి కనీసం ఆరువారాలైనా పడుతుంది.

మార్గమధ్యంలో దొరికినది తింటూ, అవకాశా లున్న చోట పడుకుంటూ గంగానదినే స్మరిస్తూ, భగ వంతుని ధ్యానం చేస్తూ ఒంటరిగానూ, చిన్న చిన్న బృందాలుగానూ కదిలే సాధువులను చూస్తూ రామ్సురత్ కున్వర్ పరవశించిపోయేవాడు. వారికి సాష్టాంగ ప్రణామం ఆచరించేవాడు. వారి వెంట నడిచేవాడు. వారు బృందంగా ఏవైనా చర్చలు జరుపుతూ వుంటే ఆ చర్చలను శ్రద్ధగా గమనించేవాడు.

ఆ సాధువులలో ఎవరైనా ఆ గ్రామంలో రాత్రి పూట బసచేస్తే తను ఇంటికి పరుగెత్తుకు వెళ్లి తల్లి దగ్గర ఆహారపదార్థాలను అడిగి తెచ్చి వారికి సమర్పించు కొనేవాడు.

ఆరేళ్లపాటు దాదాపుగా ఎనిమిదివేల కిలోమీటర్లు గంగా తీరాన సంచరించిన ఒక సాధువు తనకు నమస్కరించే బాలునికి ఏమని బోధిస్తాడు. ఏకాంతాన్నే అతనికి ఆశీర్వాదంగా ఆ సాధువు ఇవ్వగలడు.

రామ్సురతున్వర్ పాఠశాలలో తన పాఠాలను చక్కగా చదివి సమీపంలోని ఒక చిన్న నగరానికి పై చదువుల కోసం వెళ్ళి అక్కడ తొలిశ్రేణిలో ఉత్తీర్ణుడైనప్పుడు కూడా, లోలోపల ఏకాంతాన్ని మాత్రమే ఆస్వాదించేవాడు. రామ్సురత్ కున్వర్ ఒక జ్ఞానిలా ఎదగడానికి ప్రారంభ దశలో గంగాతీరాన గడిపిన జీవనవిధానం ఒక కారణమైంది.

రామ్పురత్ కున్వర్ పన్నెండవ ఏట అతని జీవితాన్ని మలుపుతిప్పే ఒక సంఘటన జరిగింది.

రామ్సురత్ కున్వర్కు తన తల్లంటే అపారప్రేమ. ఆమె అతనికి శ్రీరాముని గురించి, కృష్ణుని గురించి ఎన్నో కథలు చెబుతూ ఉండేది.

తల్లికి ఇంటి పనులలో సాయపడుతూ ఆ కథలను మళ్ళీమళ్లీ చెప్పమని ఆమె వాటిని చెబుతుంటే ఆస్వాదిస్తూ వుండేవాడు రామ్కురుతున్వర్.

ఒక రోజామె ఇంట్లో పనులకు నీరు కావలసి వచ్చి వాటిని తెమ్మని కుమారుని ఆదేశించింది. రామ్ సురత్కుమార్ చేదతో ఇంటికి దగ్గరున్న బావికి వెళ్ళాడు.

అక్కడ అతను బావిలో నీటిని చేదుకుంటున్న ప్పుడు అక్కడి గట్టుమీద ఒక చిన్న పిచ్చుక కూర్చుని రామ్సురత్కుమార్ను ఆసక్తిగా చూస్తూ వున్నది.

ఆ పిచ్చుకతో ఆడుకుందామనుకున్న పిల్ల చేష్టలతో రామ్సురత్ కున్వర్ తన చేతిలోని తాడును దానివైపు విసిరాడు. కానీ అనుకోకుండా ఆ తాడు ఆ పిచ్చుకకు తగిలి పిచ్చుక క్రిందపడింది.

రామ్సురత్కుమార్ చేతిలోని చేదను క్రిందపడేసి పరుగున వెళ్ళి ఆ పిచ్చుకను చేతుల్లోకి తీసుకున్నాడు.దానిని పట్టుకుని చూడగా దానికి తాడు తగిలి గాయాలైనాయి.

దానిని అరచేతిలోకి తీసుకుని గంగాతీరానికి పరుగుతీశాడు. 'గంగామాతా! ఈ పిచ్చుకను కాపాడు అని గంగామాతకు మొరపెట్టుకున్నాడు. ఆ గంగా జలాన్ని ఆ పిచ్చుక నోటిలో పోశాడు. కానీ నిష్ప్రయోజనం. ఆ పిచ్చుక అతని చేతుల్లోనే ప్రాణాలను వదలింది. రామ్ సురత్ కున్వర్ నిశ్చేష్టుడైనాడు.

దాని మరణం అతని కంట నీరు ఒలికించింది అతని హృదయం కరగిపోయింది. గంగాతీరంలో కూర్చుని అపరాధ మనోభావంతో తల్లడిల్లిపోయాడు.

ఈ చిన్ని పిచ్చుక నా చేతుల్లో ఎందుకు ప్రాణా లను కోల్పోయింది! దీని సౌందర్యం ఏమైంది? దీని ఎగిరే శక్తి ఎక్కడికి పోయింది? రెక్కలు వున్నా ఇది ఎందుకు ఎగరలేకపోయింది? దీనిలో నుండి వాస్తవంగా బయటకి పోయిందేమిటి? ఆ బయటకు పోయినది మరలా ఈపిచ్చుకలోకి రాదా? ఈ పిచ్చుక ప్రాణాలు పోవడానికి కారణం ఏది? ఆ తాడా లేక నేనా?

అతని మనసులో ఇలాంటి అనేక ప్రశ్నలు తలెత్తాయి. కానీ ఏ ప్రశ్నకూ సమాధానం లభించలేదు. దుఃఖం అతడిని ఆవరించుకున్నది. చేతిలోని పిచ్చుక శరీరాన్ని గంగానదిలోకి విడిచిపెట్టాడు. ఆ నీటి ప్రవాహంలో పిచ్చుక శరీరం కొట్టుకుపోయింది. రామ్ సురత్ కున్వర్ ఆ గంగానది ఒడ్డున చాలాసేపు వెక్కివెక్కి ఏడ్చాడు.

సంతోషంతో చిందులేసే అతని జీవితంలో పిచ్చుక మరణం ఒక మాయని మచ్చ అయింది. అదొక దుస్సంఘటనగా భావించాడతను.

ఆ జీవియొక్క ప్రాణాన్ని హరించే శక్తి నాకెలా వచ్చింది. అసలు ఈ సంఘటన ఎందుకు జరిగింది. ఇలా జరగడానికి కారణమెవరు?" ఇలాంటి అనేక ప్రశ్నలు అతని మనసును తొలిచివేశాయి. వీటికేవైనా జవాబు లభిస్తుందా అని ఆ

పసిపయసులో తెగ ఆలోచించాడు. ఆ సంఘటనతో అతని జీవితంలో ఆధ్యాత్మిక మార్గానికి తలుపులు తెరచుకున్నాయి.

జనన, మరణాల గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు. ఆ క్షణం నుండి అతని ఆటాపాటా, పిల్లచేష్టలూ అన్నీ అణగారిపోయాయి. ఇతరులకు దూరమైనాడు.

రామ్ సురత్ కున్వర్ కు పదహారేళ్లు వచ్చాయి. గంగానది తీరాన వాసిస్తున్న కపాడియా బాబా అనే సాధువు అతడిని కాశీకి వెళ్లిరమ్మన్నాడు.

నర్దారా గ్రామానికి కాశీనగరం దగ్గరలోనే వుంది రామ్ సురత్ కున్వర్కు పాఠశాల సెలవు రోజులలో కాశీకి వెళ్లి అక్కడి దేవాలయాలకు ప్రదక్షిణ చేయడం అలవాటు.

కపాడియా బాబా 'కాశీకి వెళ్ళిరా' అని చెప్పగానే దానిని దైవవాక్కుగా భావించి అతడు కాశీకి వెళ్ళాడు.

విశ్వనాథుని ఆలయంలో ప్రవేశించి శివలింగం ఎదుట నిలిచినప్పుడు ఒక విచిత్ర అనుభవం అతనికి కలిగింది. అతనిలోకి ఎవరో మెల్లమెల్లగా ప్రవేశించి నట్టయి శరీరంలో ఒక పరవశత్వం కలిగి, ఒళ్ళు పులకరించిపోయింది. తాను ఎక్కడ వున్నాడు అనే విషయమూ అతనికి తెలియలేదు.. సమయం ఎంత గడిచిందో తెలియదు. తన పరిసరాల్లో ఏం జరుగుతుందో ఆ స్పృహ కూడా అతనికి లేదు. ఏదో దైవీక శక్తి అతడిని ఆవహించిన భావన కలిగింది.

ఆ పరవశస్థితిలో తాను ఎంతసేపు ఆ దేవా లయంలో ఉన్నాడో అతనికి తెలియదు. స్పృహ వచ్చాక కాశీలోని గంగాతీరానికి వచ్చాడు.

గంగాతీరంలోని స్మశానానికి ఆ రోజు ఎన్నో శవాలు వచ్చాయి. చితులు పేర్చబడ్డాయి. వాటిపై శవాలు ఉంచబడి నిప్పుపెట్టబడింది. చితులు భగభగా మండు తున్నాయి. రామ్సురత్ కున్వర్ ఆ రోజు తనను మరచి ఆ శవాలు మండుతుండడాన్నే చూస్తూ వుండిపోయాడు. దాని ఫలితంగా అతనికి దేహభ్రాంతి తొలగిపోయింది. ఆ రోజు అతని దృష్టి, మనసు పూర్తిగా ఆ దహనక్రియ మీడే లగ్నమై వున్నది. అతను పరిసరాలనూ, గంగా ప్రవాహాన్ని మరిచాడు. చుట్టు ప్రక్కల వున్నవారిని మరిచాడు ఆకాశం, భూమి, పక్షులు, ప్రాణులు, వృక్షాలు, తీగలు అన్నీ మరిచాడు.

తన దేహం కూడా శవమై గంగాతీరంలోని స్మశానానికి తీసుకు రాబడడమూ, దాని చుట్టూ కట్టెలు పేర్చబడటమూ, దానికి నిప్పుపెట్టడం, ఆ తరువాత అస్థిసంచయనం జరగడం లాంటివి కనులారా చూశాడు ఆ పదహారేళ్ల వయసు బాలకుని మనసులో అక్కడ మౌనంగా ఒక మరణం సంభవించింది.

గంగా తీరంలో, నదీతీరంలో వున్న ఆలయ గోపురాలలో ఇలా ప్రతిచోట తానే ఉన్నట్లు భావించాడు. సుదీర్ఘ సమయం తరువాత అతడు జాగ్రదావస్థకు వచ్చాడు. ఇన్ని సంఘటనలు జరిగిన తరువాత కూడా తన దేహం నశించకపోవడాన్ని గమనించాడు.

కపాడియా బాబాతో కాశీలో తనకు ఏర్పడిన అనుభూతులను గురించి వివరించాడు. ఆ సాధువ వీటన్నిటినీ విని బిగ్గరగా నవ్వాడు. తక్షణం తమాయించు కుని రామ్ సురత్కున్వర్ ను చూసి "తులసీ రామాయణం. చదువు. భగవద్గీతను పారాయణం చేయి, నీలో తలెత్తే సందేహాలకు అవి పరిష్కారం చూపుతాయి. ఆధ్యాత్మిక జీవనానికి తోడుగా వుంటాయి" అన్నారాయన.

యోగి సురత్ కుమార్ గా పరివర్తన చెందడానికి రామ్ సురత్ కున్వర్ కు పదహారవ వయసులోనే బీజం పడింది. మరెవరికీ కలుగని ఈ అనుభవాలు అతనికి కలుగడానికి ఏమిటి కారణం?

తన తల్లిగారి బోధనలు, గంగాతీరంలోని కపా డియా బాబా ఉపదేశం, కాశీలో సాధువుల సాంగత్యం, దాని తరువాత కాశీ విశ్వనాథుని దేవాలయంలోని అనుభవమా లేక వీటన్నిటి సమాహారమా? కానీ ఆధ్మాత్మిక జీవనం ఎవరికీ అంత త్వరగా పట్టుబడదు.అది పట్టుబడకుండా, మార్గం సుగమం కాకుండా ఎన్నో ఆటంకాలు కలుగుతాయి. రామ్ సురత్ కున్వర్ కూ అలాంటివెన్నో ఆటంకాలు ఏర్పడ్డాయి.

వాటిల్లో ముఖ్యమైనది అతని వివాహం, ఇంటికి పెద్దకొడుకైన మనార్కన్ కుస్వర్కు వివాహం జరిగింది. ఇంటికి వచ్చిన పెద్ద కోడలు ఇంటి బాధ్యతలు వహించింది.

ఆమె తన మరిదికి కూడా వివాహ వయసు వచ్చింది కాబట్టి అతనికీ వివాహం చేస్తే, రాబోయే కోడలు తనకు ఇంటి పనులలో చేదోడువాదోడుగా ఉంటుంది కాబట్టి అతనికీ వివాహం చేయాలని అనడంతో రామ్ సురత్ కుమార్ కు అమ్మాయిని వెదికే పని ప్రారంభమైంది ఆ కాలంలో బాల్యవివాహాలు సర్వసాధారణం. పక్కనున్న పెద్ద గ్రామం పాఠశాలలో రామ్సురత్ కున్వర్ చదువులో శ్రద్ధ వహించగా, ఇక్కడ నగ్గారాలో అతనికి సంబంధం చూసే పనులు ఆరంభమైనాయి వారి ప్రయత్నాలు ఫలించి వారు రామ్ సురత్ కున్వర్ కు ఒక అమ్మాయిని భార్యగా నిశ్చయించారు.

పాఠశాలకు మనిషిని పంపి అతనిని ఇంటికి రప్పించారు. అతనికి వివాహం నిశ్చయించామని తెలి పారు. అయితే రామ్ సురత్ కున్వర్ తనకిప్పుడు వివాహం అవసరం లేదని చెప్పాడు.

కానీ ఇంట్లోని ఎవరూ అతని మాటను పట్టించుకో లేద. పెళ్లి నిశ్చయమైంది కాబట్టి చేసుకోవాలసిందేనని అతడిని బలవంతపెట్టారు. ఇందులో అతను జోక్యం చేసుకోరాదని ఆదేశించారు. అమ్మాయికి తాళిబొట్టు కట్టి భార్యగా చేసుకోవలసిన బాధ్యత అతనిదేనని కచ్చితంగా చెప్పేవారు.

పెళ్ళి పనులు ఆరంభమైనాయి. రామ్ సురత్ కున్వర్ కు ఆ పరిస్థితులలో ఏం చేయాలో అర్థం కాలేదు పెళ్ళికి ఇంకా రెండు రోజులుండగా రామ్ సురత్ కున్వర్ గంగానదిలోకి దూకి ఈదుకుంటూ అవతలి తీరం చేరి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

పెళ్ళికొడుకు కనబడలేదని అందరూ కంగారు పడ్డారు. ఎక్కడెక్కడో వెదికారు. రామ్ సురత్ కున్వర్ దొరకలేదు. ఇక తెల్లవారితే పెళ్ళి. ఇంట్లో వారికి మరో మార్గం గోచరించలేదు మాట ఇచ్చాక పెళ్ళి జరగాల్సిందే. కాబట్టి పెళ్ళిరోజున దల్ క్రియాదేవిని తమ మూడవ కుమారుడైన రామ్ దహీన్ కున్వర్ కు ఇచ్చి పెళ్ళి జరిపించారు.

తమ్ముడికి పెళ్లైన మూడు రోజులకు రామ్ సురత్ కున్వర్ ఇంటికి తిరిగి వచ్చాడు. అందరూ అతడిని ఎడాపెడా నిందించారు. అయితే రామ్సురత్ కున్వర్
ఎలాంటి జవాబూ ఇవ్వలేదు. వారి తిట్లన్నిటినీ మౌనంగా భరించాడు. తన చదువును కొనసాగించాడు.

కానీ రామ్సురత్ కున్వర్ మీద అపార ప్రేమ అభిమానం గల అతని పెద్దన్నయ్య, మనార్కన్ కున్యర్ తమ్ముడిని 'ఎందుకిలా చేశావు?" అని ప్రశ్నించగా రామ్ సురత్ కున్వర్ అన్నయ్యతో 'తనకు వివాహం అంటూ జరిగితే అది చదువుకున్న అమ్మాయితోనే జరగాలి. అంతే కాదు, పెళ్ళికి ముందే ఆ అమ్మాయితో మాట్లాడి ఆమెతో తాను వివాహ బంధాన్ని కొనసాగించగలగనన్న నమ్మకం కుదిరితే తప్ప, తాను వివాహానికి సమ్మతించను" అని చెప్పగా ఇంట్లో అందరికీ షాక్.

పెళ్ళికి ముందు అమ్మాయితో మాట్లాడటమా? అలాంటి ఒక సంప్రదాయం ఆ ప్రాంతంలోనే లేదే ఇదేంటి ఇలా అంటున్నాడు అని వారు రామ్సురత్ కున్వర్ మాటలను తేలిగ్గా కొట్టిపారేశారు. అయితే రామ్ సురత్ కున్వర్ తన పట్టుదలను వదలిపెట్టలేదు.

ఇలాంటి నియమం పెడితేనే తనకు సంబంధం చూడరని, తాను వివాహ బంధం నుండి తప్పించుకో వచ్చని రామ్ సురత్ కున్వర్ భావించి వుండ వచ్చు. ఈ నియమం పెడితే ఎవరు పిల్లనివ్వడానికి అంగీకరిస్తారు అందువలన రామ్ సురత్ కున్వర్ వివాహం వాయిదా పడింది.

రామ్ సురత్ కున్వర్ బడిలో తన తరగతిలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత పొందాడు. అది 1937వ సంవత్సరం అలహాబాద్ లోని ఎడ్విన్ క్రిస్టియన్ కళాశాలలో ఇంటర్మీడియట్లో చేరాడు రామ్ సురత్ కున్వర్.

మరిదిగారు ఇంటర్మీడియట్ లో చదువుతున్నా ఇంకా అతనికి పెళ్ళి ప్రయత్నాలు చేయలేదేమని పెద్ద కోడలు సణిగింది. అతడు కచ్చితంగా పెళ్ళి చేసు కోవాల్సిందేనని పట్టుబట్టింది. రామ్ సురత్ కున్వర్ మరలా తన పాత పాటే పాడాడు.

తమ అమ్మాయి ఇవ్వడానికి ఒక కుటుంబం ముందుకు ఆశ్చర్యం అతని ఈ నియమాన్ని అంగీకరించి వచ్చింది. వారి గ్రామానికి కొద్ది దూరంలో వున్న మరో గ్రామంలో ఏడవతరగతి చదువుతున్న తమ కుమార్తెకు వివాహం చేయాలని ఒక కుటుంబం ప్రయత్నిస్తున్న విషయం తెలిసింది. ఇద్దరి కుటుంబాలకు బాగా కావా ల్సిన ఒక మిత్రుడు "చదివిన కుర్రాడున్నాడు. కానీ ఈ నిబంధన వున్నది" అని చెప్పగా వారు నర్దారాకు వచ్చి రామ్సురత్ కున్వర్ ను చూశారు.

మంచి కుటుంబం, అబ్బాయి బుద్ధిమంతుడు సంప్రదాయాలు అనుసరిస్తాడు. భగవద్భక్తి ఉన్నవాడు అన్ని వివరాలు తెలిసి వారు అతనికి పిల్లనిద్దామని తీర్మానించుకున్నారు. అయితే పిల్ల ఏడవతరగతి చదువు తోందని చెప్పారు. కాబట్టి మొదటి నిబంధన సరి పోయింది.

కానీ రెండవ నిబంధన. అమ్మాయితో పెళ్లికి ముందే మాట్లాడాలి. ఆశ్చర్యంగా పిల్ల తల్లిదండ్రులు ఇందుకు సమ్మతించారు. అయితే అది తమ ఇంటికి దగ్గరవున్న ఒక డాక్టర్ ఇంట్లో రామ్ సురత్ కున్వర్ తల్లిదండ్రులను బసచేయించి తన కుమార్తెను అక్కడికి పంపి, అలా పంపే సమయంలో రామ్సురత్ కున్వర్ ఆ అమ్మాయితో మాట్లాడవచ్చు అన్నారు.

ఒక వేళ ఈ సంబంధం కుదరకపోతే ఎవరో పిల్లను చూడ్డానికి వచ్చి వెళ్ళారు అని చెప్పవచ్చునే తప్ప పిల్లను చూడవచ్చినప్పుడు మాట్లాడాడు అని చెప్పవలసిన అవసరం లేదు అని భావించి వారు ఈ ఏర్పాట్లకు అంగీకరించారు.

ఆ అమ్మాయి ఒక పళ్ళెం నిండుగా తీపి పదార్థాలు తీసుకుని డాక్టర్ ఇంటికి వచ్చి ఆయనకు వాటిని అందించి వెనుదిరిగినప్పుడు రామ్ సురత్ కున్వర్ ఆ అమ్మాయి పేరు అడిగాడు. రామ్ రంజనిదేవి అనగానే నువ్వేం చదివావు అని అడగా 'ఏడవతరగతి' అన్నది ఏ పాఠశాల?' రామ్ సురత్ కున్వర్ ప్రశ్నకు బదులిచ్చి ఆ అమ్మాయి అక్కడి నుండి పారిపోయింది. ఈ మూడు ప్రశ్నలతో ఏమర్థం చేసుకోగలం రామ్ సురత్ కున్వర్ విస్మయం చెందాడు.

అయితే మాట్లాడుకున్న తరువాత కదా పెళ్ళి చేసుకోవాలన్న నిబంధన. మాట్లాడడం పూర్తయింది ఇంకా ఏం చేయబోతున్నావ్?' అని బంధువులు అతడిని అడిగారు. మరో దారిలేక రామ్ సురత్కున్నర్ ఆ అమ్మాయితో పెళ్ళికి అంగీకరించాడు. అతను పెళ్లికి అంగీకరించాడని తెలిసి పిల్ల ఇంటివారు సంతోషించారు.

బీహార్ రాష్ట్రంలోని పలక్నదీ తీరంలోని దహియా గ్రామానికి చెందిన రామ్రంజనీదేవి మెడలో ఇంటర్మీడి యట్ చదువు పూర్తి కావడానికి ముందే రామ్సురత్ కున్వర్ 22.07.1938న తాళిబొట్టు కట్టాడు.

రామ్ సురత్ కున్వర్ తరుణావస్థ అంతటితో పూర్తయింది. ఇప్పుడతడు గృహస్థుడైనాడు. కాబట్టి ఊరి లోని ప్రతి ఒ.క్కరూ అతనిని గౌరవంతో చూడనారం భించారు

వివాహబంధంలో చిక్కుకున్నా రామ్ సురత్ కున్వర్ తన ఆధ్యాత్మిక పయనాన్ని మానలేదు.

మామగారి ఊరిలోని పలాక్ నదీ తీరంలో సంచరించాడు. శివాలయంలో కూర్చునేవాడు

ఇంటర్మీడియట్ పూర్తి చేసిన తరువాత అదే కళాశాలలో బి.ఏ. ఆంగ్ల మాధ్యమంలో చేరాడు చదువులో ఆసక్తి కొనసాగింది. అతడు అలహాబాద్లో చదువుకునే సమయంలో అతని భార్య తన తండ్రి ఇంటిలో వుండేది.

రామ్ సురత్ కున్వర్ తన , మామగారింటికి .తరచుగా వెళ్ళి వస్తుండేవాడు. మామగారికి ఒక సోదరుడ ఉండేవాడు. అతనికి ఇద్దరు అబ్బాయిలు. రామ్ సురత్ కున్వర్ మామగారికి ఇద్దరు కుమారులు, రంజనీదేవి ఒక కుమార్తె. అంతమంది సోదరుల మధ్య ఆడపిల్ల కాబట్టి ఆమెకు గారాబం ఎక్కువే.

అందువల్ల అల్లుడు తమ ఇంట్లో వుంటే వారికి ఎంతో సంతోషం.

లో గంగానదికి వెల్లువవచ్చింది. రామ్ సురత్కున్వర్ తండ్రికి సొంతమైన ముప్పై ఎకరాల భూమి ఇల్లు ఈ వెల్లువలో మునిగిపోయాయి. ఆయన కాస్త ఎత్తైన చోట ఒక చిన్న ఇల్లు కట్టుకున్నాడు. కుటుంబంలో పేదరికం తాండవిస్తోంది. ఈ పరిస్థితిలో రామ్ సురత్ కున్వర్ తండ్రి రామదత్ కున్యర్ మరణించారు.

రామ్ సురత్ కున్వర్ 1945లో బి.ఎ. పూర్తి చేశాడు. తరువాత నర్దారాకు వెళ్ళాడు ఈ సమయంలో ఆ రామ్రంజనీదేవి ఒక కుమార్తెకు జన్మనిచ్చింది కుమార్తెకు రామ్ సురత్ కున్వర్ 'యశోధరా' అని నామకరణం చేశాడు. బుద్ధుని భార్య పేరుకూడా యశోధరానే.:రామ్ సురత్ కున్వర్ భార్య, కుమార్తెతో నర్దారాకు తిరిగి వచ్చాడు. కాని తమ్ముని భార్య వారిని నానా మాటలూ అన్నది.

ఇక్కడ ఇంట్లో వారందరూ పగలనక రాత్రనక సేద్యం చేస్తూ కష్టపడుతుంటే మీరు చదువు పేరిట డబ్బును ఖర్చు చేస్తున్నారు. ఇంటికి ఒక చిల్లి కాసుకూడా ఇవ్వకుండా సాధువులు, సన్యాసులు వెంట తిరుగుతుంటే ఇల్లెలా గడుస్తుంది. మీరు పెళ్ళి చేసుకుని పిల్లల్ని కంటారు. మేము మాత్రం గొడ్డులా చాకిరి చేస్తూ వుండాలా?.

ఇక రామ్ సురత్ కున్వర్ కు భార్యా పిల్లలతో అక్కడ ఉండడం అసాధ్యం అనిపించింది. వెంటనే రామ్సురత్ తన అత్తగారింటికి వెళ్ళాడు వారు సాదరంగా కూతురినీ అల్లుడినీ స్వాగతించారు. ఇప్పుడిక రామ్సురత్కున్వర్ ఉద్యోగపు వేటలో పడాడు. అయితే బీహార్లో ఉద్యోగం దొరకాలంటే అతడు డ. బీహార్ లో పుట్టివుండాలి లేదా బీహార్లో ఆస్తిపాస్తులు కలిగి ఉండాలి.

రంజనీదేవి తండ్రి తన ఇంటి ఎదుట అల్లుడికోసం కొంత భూమిని కొని, ఇల్లు కట్టి, రామ్ సురత్ కున్వర్ పేరిట దానిని రిజిస్టర్ చేశాడు. ఇంతలో రామ్సురత్ కున్వర్ కు అక్కడి పాఠశాలలో చిన్న ఉద్యోగం దొరికింది. ఉపాధ్యాయుడిగా పనిచేయా లంటే రామ్సురత్ కున్వర్కు చాలా ఇష్టం.

తనకు బాగా తెలిసిన ఆంగ్ల పాఠాలను, చరిత్రనూ పిల్లలకు ఆసక్తికరంగా బోధించేవాడు. కానీ ఆ ఊరిలో వాతావరణం చాలా చలిగా వుండేది. ఆ వాతావరణం అతని ఆరోగ్యంపై ప్రభావం చూపింది. అందువలనఅతను అక్కడి నుండి మరోచోటికి బదిలీ అయినాడు. కానీ అక్కడ కూడా అతను ఇమడలేకపోయాడు.

అంతలో అతనికి ఒక ఉన్నత పాఠశాలలో ఉద్యోగం దొరికింది. కొంతకాలం వుద్యోగం చేసి ఉపాధ్యాయుడిగా మరింత శిక్షణ పొందడానికి విరామం తీసుకుని పై చదువుల కోసం వెళ్ళాడు. కొద్ది కాలానికి ఆ శిక్షణ పూర్తి చేసుకుని మరలా ఉపాధ్యాయుడిగా ఉద్యోగంలో చేరాడు.

ఈ మధ్యలో 1947లో అతనికి ఒక కుమూరుడు జన్మించాడు. ఆ కుమారునికి అతడు 'అమితాబ్ కున్వర్' అని పేరు పెట్టాడు. అమితాబ్ అంటే బుద్ధుని సూర్యుడు బుద్ధుని వెలుగు అని అర్థం.

సంసార తాపత్రయాలను అధిగమించి, ఆచార సంప్రదాయాలను తోసిరాజని, భగవంతుని సేపే ముఖ్య మని భావించే బుద్ధుడే రామ్సురత్ కున్వర్కు ఆదర్శ ప్రాయుడైనాడు.

మనసునిండా భగవంతుడు, మార్గం ఆధయాత్మికం అయిన రామ్ సురత్ కున్వర్ పైకి మాత్రం సంసార జీవనం సాగిస్తున్నాడు.

కుటుంబ బాధ్యతలను నిర్వర్తించడం, భగవంతుని అన్వేణకు సమం. కానీ ఇంటిని పరిత్యజించడం అంటే హత్య చేయడానికి సమం. తాను సంసారాన్ని పరిత్యజించి హత్యాపాతకానికి ఒడిగట్టాలా అనేది అతని భావన.

మనసులో భగవత్ చింతన నిండి వుండగా ఇంటిని పరిత్యజించడం సాధ్యం కాదు. ఆ బాధను అతను ఏకాంతంగా అనుభవిస్తూ వుండేవాడు. ఈ సందిగ్గ పరిస్థితులలో అతనికి కాస్తంత ఉపశమనం కలిగే రీతిలో చౌధురి అనే మిత్రుడు తారసపడ్డాడు. వీరిద్దరూ మహాత్ముల గురించి, సాధువుల గురించి, భగవదన్వేషణలో రకరకాలుగా పాల్గొనడం గురించి గంటల కొద్దీ సంభాషించుకునేవారు.

చౌధురితో గంటలే కాదు రోజుల తరబడి సంభాషించిన దాని ఫలితంగా రామ్ సురత్ కున్వర్కు ఒక మంచి ప్రదేశానికి వెళ్ళడానికి ప్రేరేపణ కలిగింది నర్ధారాకు వచ్చినపుడు అతడు భగవంతుని ప్రత్యక్షం చేసుకోవడం ఎలా అని కపాడియా బాబాను అడిగాడు.

ఆ సమయంలో రామ్ సురత్ కున్వర్ సంపాదనా పరుడైనందువలన అతని కుటుంబ సభ్యులు, బంధువులు అందరూ అతడిని ఆదరంగా చూసుకునేవారు

అతడు కపాడియా బాబా వద్ద కూర్చోవడానికి ఎలాంటి ఇబ్బందీ పడలేదు. అప్పుడు కపాడియా బాబా అతనితో "భగవదన్వేషణ చేయాలంటే ఆ వ్యక్తికి ఒక గురువు కావాలి. కేవలం మాట్లాడుతూ వున్నంత మాత్రాన, తపిస్తూ వున్నంత మాత్రాన భగవంతుని చేరుకోవడం సాధ్యం కాదు. ఆయనను పొందాలంటే అంతరంగంలో ఒక అర్హత పొందాలి. తనకేం కావాలో తెలుసుకుని, దానిని అనుగ్రహించగల గురువు కావాలి.

నీకు తగిన గురువు ఈ ప్రాంతాలలో లేడు. దక్షిణ భారతదేశంలో తిరువణ్ణామలై అనే ఒక అద్భుతమైన పుణ్యస్థలం ఉన్నది. అక్కడ రమణమహర్షిగారున్నారు. ఆయన సాన్నిధ్యం నీకు మేలు కలిగిస్తుంది. అంతే కాదు కలకత్తానుండి అరవిందఘోష్ అనే మహాత్ములు పాండిచేరిలో ఆశ్రమం ఏర్పాటు చేసుకుని తపస్సు చేస్తున్నారు. ఆయనను కలవడం కూడా మంచిది. కాబట్టి నువ్వు ఇక్కడ కూర్చుని భగవంతుని అన్వేషించడాన్ని వదిలి దక్షిణాపథంవైపు బయలుదేరు. అక్కడ నీ గురువును వెదుకు. గురుదేవులు లేనప్పుడు భగవంతుని తెలుసు కోవడం దుర్లభం" అని ఉపదేశించారు. రామ్ సురత్ కున్వర్ కు పరీక్షా సమయం ఆసన్నమైంది.

ఒక వేసవికాలం సెలవుల్లో రామ్ సురత్ కున్వర్ తన పయనాన్ని దక్షిణాపథం వైపునకు ప్రారంభించి తిరువణ్ణామలై చేరుకున్నాడు.

అగ్ని క్షేత్రమై సెగలు వెదజల్లే తిరువణ్ణామలై చల్లని
గాలులను పంపి రామ్ సురత్ కున్వర్ ను ఆహ్వానించింది రైల్వేస్టేషన్లో దిగి రమణాశ్రమం వైపుకు నడిచాడు వచ్చేదారిలో అరుణాచల పర్వతాన్ని దర్శించు కున్నాడు. ఆ పర్వతం శివస్వరూపం. అద్భుతమైన జ్ఞానులు, సాధువులూ సంచరిస్తున్న స్థలం. ఆ పర్వతానికి రామ్ సురత్ కున్వర్ నమస్కరించాడు. కనులారా దర్శించు కున్నాడు. ఆ పర్వత ప్రకంపనలు ఇదొక అద్భుతమైన ప్రదేశం అని అతనికి తెలిపాయి.

మార్గాన్ని అడుగుతూ రమణాశ్రమం దిశగా పర్వతానికి ప్రక్కనే వున్న బాటలో నడిచాడు. అది పగటి సమయం. రోజుల్లో వాహన రాకపోకలు తక్కువగా ఉండేవి. పెద్దగా ఇళ్లు, భవనాలు లేవు. కొండచుట్టు ప్రాంతంలో నడిచేప్పుడు పరిసరాలన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. అయినా అతని మనసులోమామగారింట్లో భార్య ఎలా వుందో? పిల్లలు ఎలా ఉన్నారో? ఆశ్రమంలో భోజనం దొరుకుతుందా? రేపు కూడా ఇక్కడే వుండమంటారా? లేదా మరెక్కడికైనా వెళ్లి వుండమంటారా? ఎలా వెళ్ళడం? ఎలా ఉండడం?" ఇలా ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి.

ప్రశాంత మైన బాటలో నడుస్తున్న అతని మనసులో ఆధ్యాత్మిక భావనలు మొదలవుతున్నాయి రమణాశ్రమంలో ప్రవేశించినప్పుడు మనసులో మరింత ప్రశాంతత ఏర్పడింది. ఆశ్రమ ప్రాంగణంలో ఒక ప్రక్కగా వున్న ఆసనంపైన భగవాన్ రమణమహర్షి కూర్చుని వుండగా ఆ గదిలోకి రామ్ సురత్ కుమార్ ప్రవేశించాడు.

క్కడ కొందరు రమణమహర్షికి అభిముఖంగా కూర్చుని వున్నారు. గదిలోకి ప్రవేశించిన రామ్ సురత్ కున్వర్లో హఠాత్తుగా ఒక ప్రశాంతత ఏర్పడింది. ఇంత సేపుగా మనసులో చిందులు వేస్తున్న ప్రశ్నలన్నీ మాయమైనాయి. ఆలోచనలూ చెల్లాచెదురైపోయాయి. లోపల గాఢమైన ప్రశాంతత చోటుచేసుకున్నది.

తరువాత రమణుల చెంతకు వెళ్ళి చేతులు జోడించి, నిలబడ్డాడు. ఆయన కనులలోకి చూశాడు. రమణమహర్షి తన ఎదుట నిలచిన రామ్ సురత్ కున్వర్ను దీక్షగా చూసినపుడు రామ్ సురత్ కున్వర్ కు మరలా ఒక పులకరింత కలిగింది.

రమణమహర్షికి సాష్టాంగ ప్రణామం ఆచరించి లేచి అక్కడే కూర్చున్నాడు. అతనిని రమణులు మరింత అనుగ్రహంతో చూశారు.

అక్కడున్న వారందరూ మౌనంగా వున్నారు ఎక్కడా చీమచిటుక్కుమన్నంత చప్పుడు కూడా వినిపించ లేదు. అయినా ప్రతి ఒక్కరి మనసూ ఏదో చెప్పలేని అనుభూతితో నిండిపోయింది తన వైపు రమణులు సారించిన కరుణాపూరిత దృక్కులతో వెల్లువలా ప్రవేశించిన కటాక్షాన్ని భరించలేకరామ్ సురత్ కున్వర్ కొద్దిసేపు తనకు తెలియకుండానే కనులు మూసికొన్నాడు.

ఆ తరువాత రామ్ సురత్ కున్వర్ మరలా కనులు తెరచి చూడగా రమణుల దృష్టి ఇంకా తనపై ఉండడాన్ని గమనించాడు. ఒళ్ళు పులకరించి, కంటి నుండి నీరు జాలు వారింది.

రమణమహర్షి తన స్థానం నుండి కొద్దిగా ప్రక్కకి జరగ్గానే రామ్సురత్ కున్వర్ కూడా తన స్థానం నుండి కదిలాడు. అతనికి ఆశ్రమంలో బసచేయడానికి ఒక గది కేటాయించబడింది.

రమణమహర్షి దర్శనం ఇచ్చేప్పుడు ఆయన ఎదుటనే కూర్చునేవాడు రామ్ సురత్ కున్వర్. ఆయన విశ్రాంతి తీసుకునే సమయంలో పర్వతాన్ని ఎక్కేవాడు గిరిని ప్రదక్షిణ చేసేవాడు. అరుణాచలేశ్వర దేవస్థానానికి వెళ్లి పరమేశ్వరుని దర్శించుకుని వచ్చేవాడు. ఆదేవాలయము, దేవాలయ గోపురంలోని ప్రకంపనలు రామ్ సురత్ కున్వర్ను పరవశింపజేశాయి.

అతను పదేపదే రమణులవారిని దర్శించిన ప్పుడు, గిరిని ప్రదక్షిణం చేసినప్పుడు సదా ఒక ధ్యాన స్థితిలో, పరవశ స్థితిలో వుండేవాడు. కొద్ది రోజుల తరువాత అత్తగారి ఊరైన దహియాకు వెళ్లవలసిన సమయం ఆసన్నమైంది.

రామ్ సురత్ కున్వర్ రమణులకు సాష్టాంగ నమస్కారం చేసి "నేను భగవంతుని పాదాల సన్నిధికి చేరుకోవాలని ఆశీర్వదించండి. ఆయన పాదాలను నేను గట్టిగా పట్టుకోవాలని అనుగ్రహించండి. దానికి సూచనగా నేను మీ పాదాలను గట్టిగా పట్టుకుంటాను. నన్ను కటాక్షించండి" " అనగానే రమణులు బిగ్గరగా నవ్వి "సరి అన్నారు.

రామ్సురత్ కున్వర్ తమిళభాషలో నేర్చుకున్న తొలిపదం 'సరి' 'సరి' అనేది ఒక సాధారణ పదమైనా,ఒక గురువుగారికి మొరపెట్టుకుని వారు 'సరి' అనడం వారి పరిపూర్ణ అనుగ్రహం లభించిందనే దానికి సరైన అర్థం.

రామ్ సురత్ కున్వర్కు రమణులతో ఏర్పడిన అనుబంధం విజయవంతంగా ముగిసింది. లోపల ప్రేమ పొంగి పొరలింది. అదే ఉద్వేగంతో అతను పాండిచ్చేరికి వెళ్లి అరవిందఘోష్ కలుసుకోవాలని భావించాడు పాండిచేరికి వెళ్ళినా రామ్ సురత్ కున్వర్ కు ఆయన దర్శనం కలుగలేదు.

శ్రీఅరవిందులు ఏకాంతాన్ని ఎక్కువగా అభిలషి స్తున్నందువలన సాధారణంగా ఆయన ఎవరినీ దర్శనా నికి అనుమతించరు. అందువలన రామ్ సురత్ కున్వర్ అరవిందులు రచించిన కొన్ని పుస్తకాలను తీసుకుని దహియాకు బయలుదేరాడు.

భౌతిక ప్రపంచానికి దూరంగా, దాని సంపర్కం లేకుండా, కేవలం పరమాత్మనే అన్వేషించేవారు వున్నా కూడా రామ్సురత్ కున్వర్ ఆ మార్గాన్ని అనుసరించక ప్రాపంచిక జీవితంలో తనను సంపూర్తిగా ఐక్యం చేసుకున్నాడు.

దహియాలోని ఒక పాఠశాలలో ఉద్యోగానికి ెళ్ళి అక్కడ అన్ని ప్రక్కలా తిరిగి చూశాడు. అది కేవలం ఒక కట్టడమే తప్ప దాన్ని పాఠశాల అని చెప్పడానికి ఎలాంటి అర్హతలూ లేవన్న భావన అతనికి కలిగింది.

విద్యార్థులలో ప్రసన్నత లేదు. వారికి సరైన ఉపాధ్యాయుడు లేదు. ఉపాధ్యాయులు కూర్చోడానికి రాయడానికీ తగిన కుర్చీలు, మేజాలూ లేవు. నల్లబల్ల కూడా అక్కడ లేదంటే అక్కడి విద్యార్థులకు విద్యాబోధన ఏ స్థాయిలో వుందో అర్థం చేసుకోవచ్చు.

ఈ లోపాలన్నిటినీ రామ్ సురత్ కున్వర్ ఆ బడి యాజమాన్యంతో చర్చించినప్పుడు వారు "అన్ని సౌకర్యాలతో ఇక్కడ బడిని నిర్వహించడం సాధ్యం కాదు ఉన్నవాటితోనే మీరు పాఠాలు జరుపగలిగితే జరపండి అన్నారు.

కనీస వసతులైన మరుగుదొడ్లు, త్రాగేనీరు కూడా లేకుండా పాఠశాలను నిర్వహించటమెలా సాధ్యం? వాళ్లేం పిల్లలు కాదా!" అని అడిగాడు రామ్ సురత్ కున్యర్. నిజమే వాళ్ళు పిల్లలే! కానీ ఇక్కడ సౌకర్యాలు లేవే?" అని తమ నిస్సహాయతను వెలిబుచ్చారు వారు.

వారి జవాబు రామ్ సురత్ కున్వర్ కు కోపాన్ని తెప్పించింది వెంటనే పాఠశాలకు వెళ్లి విద్యార్థులతో "ఇక్కడ బడిని మూసివేశారు" అని మీ తల్లిదండ్రులతో చెప్పండి నేను కోరిన కనీస అవసరాలను ఈ యాజమాన్యం సమకూర్చేవరకు ఈ బడి తెరవబడదు" అని చెప్పి వాళ్ళందరినీ ఇంటికి పంపేశాడు.

నాలుగైదు రోజులపాటు బడి మూయబడి వుండడం తెలిసిన పిల్లల తలిదండ్రులు దాని గురించిరామ్ సురత్ కున్వర్ను అడుగగా అతను వారితో ఆ పాఠశాల యాజమాన్యాన్ని అడగమని చెప్పాడు.

పిల్లల తలిదండ్రులు వచ్చి యాజమాన్యాన్ని నిలదీయగా వారప్పుడు మేలుకున్నారు. పిల్లల తలి దండ్రులకు ఊరిపెద్దలూ, రామ్కుమార్ కున్వర్ అండగా వున్నారని తెలిసిన పాఠశాల నిర్వాహక బృందం పాఠశాలకు కావలసిన కనీస వసతులను తక్షణం ఏర్పాటు చేస్తామని చెప్పి, దానిని త్వరలోనే ఆచరణకు తెచ్చారు కనీస వసతులు ఏర్పడగానే రామ్ సురత్ కున్వర్ పిల్లలను మరలా పాఠశాలకు ఆహ్వానించాడు. ఈ సంఘటన ఆ ఊరివారికొక మేలుకొలుపు. భగవదన్వేషణలో వున్న ఒక సాధువుకు ఇది న్యాయమైన విషయమే కదా! అనే ప్రశ్న అందరి మనసులలోను తలెత్తుతుంది. లోపాలను చూస్తే దానికి కారకులైన వారిని మందలించి, ఆ లోపాలను సరిచేయడం, ఒక అసలైన ధీరుడి కర్తవ్యం కదారామ్ సురత్ కున్వర్ పాఠశాలను సరిగ్గా గాడిన పెట్టి దానిని నిర్వహించుకుంటూ వస్తున్నాడు. ఈ మంచిపేరు వలన అతనికి మరొక పెద్దపాఠశాలలో ఉద్యోగం లభించింది. ఆ పాఠశాలలో కూడా అతను తన కర్తవ్యాన్ని చక్కగా,

సమర్ధవంతంగా నిర్వహించాడు బాధ్యతలను విస్మరించి 'నేను భగవదన్వేషణలో ఉన్నాను అని అతను ఏనాడూ పేర్కొనలేదు.

రామ్ సురత్ కున్వర్ ఒక మంచి ఉపాధ్యాయు డిగా, మంచి మిత్రుడిగా, ఉత్తమ మానవుడిగా, ఎలాంటి దురలవాట్లు లేని వ్యక్తిగా ఉన్నత జీవితం గడిపాడు అతను పిల్లల మీద అపార ప్రేమాభిమానాలను కురిపించాడు. 'వారే నా దేవుళ్ళు' అని మనస్ఫూర్తిగా చెప్పేవాడు. పిల్లలకు అక్షరాలు నేర్పించడానికి ముందే రామ' అనే అక్షరాలు రాయడం నేర్పించాడు.

బయటి శత్రువులతో పోరాడి గెలుపు సాధించి నట్లుగా తన శరీరాన్ని కూడా క్రమశిక్షణలో ఉంచుకోవా లని, కఠిన అభ్యాసాలతో కొన్ని నియమాలు పాటించాడు.

కొన్నేళ్లపాటు పచ్చి కూరగాయలను ఆహారంగా స్వీకరించేవాడు. పాలలో నౌరకాయ తురుమును వేసి చక్కెర కలిపి భార్య అందించేది. పండ్లు, కాయగూరలనే అతను దైనందిన ఆహారంగా స్వీకరించేవాడు.

ఎందుకిలా మీ ఆహారపుటలవాట్లను మార్చు కున్నారు?" అని అడిగితే తన శరీరం ఒక దైవ కార్యాన్ని నెరవేర్చడానికి సంసిద్ధమవుతోందని అందుకు అనుగుణంగా ఈ ఆహారపుటలవాట్లను అభ్యాసం చేసుకుంటున్నానని చెప్పేవాడు.

భగవంతుని చేరుకోవాలని కోరేవారు ఎలాంటి చోటైనా వాస్తవానికి విరుద్ధంగా ప్రవర్తించరు. రామ్ సురత్ కున్వర్ కూడా అన్ని ప్రదేశాలలోనూ సత్యానికి కట్టుబడి ప్రవర్తించేవాడు.

లోలోపల మరలా తిరువణ్ణామలైకు వెళ్ళాలన్న తపన, రమణ మహర్షిని డదర్శించుకోవాలన్న ఉత్కంఠ తరచుగా కలుగుతూనే వుండేవి.

ఆదిశంకరులు, శ్రీ అరవిందులు, వివేకానంద లాంటి వారి పుస్తకాలు అతనికి ఎన్నో విధాలుగా మార్గదర్శనమిచ్చాయి.

చదువులో భగవదన్వేషణ, ఆహారం సేవించేప్పుడు భగవదన్వేషణ, శ్రమించేటప్పుడు భగవదన్వేషణ- ఇలా ప్రతి విషయంలోనూ అతని దృష్టి ఏకముఖంగానే ఉండేది అది 1949వ సంవత్సరం, అత్తగారి ఊరైన దహియాను వదిలి రామ్సురత్ కున్వర్ పాండిచేరికి వచ్చాడు.

క్రితంసారి దర్శమించుకోలేని అరవిందులవారిని ఈ మారైనా కచ్చితంగా దర్శించుకోవాలన్న తపన రామ్సురత్ కున్వర్ ది. పాఠశాల, కుటుంబ నిర్వహణా బాధ్యతలు గురించి తలచుకుంటే ఊరొదిలి వెళ్లడానికి వీలుకాదు.

కుటుంబ బాధ్యతలు, విధి నిర్వహణా బాధ్యతలు భగవదన్వేషణకు ఆటంకాలవుతాయన్న విషయం వాస్త వమే. అయినా కూడా ఈ ఆటంకాలన్నీ భగవదన్వేషణా సక్తిని, గురువును దర్శించుకోవాలనే కుతూహలాన్ని మరింతగా ఇనుమడింపచేసాయి.

ఆ కుతూహలంతోనే రామ్ సురత్ కున్వర్ పాండి చేరికి వచ్చాడు. అయితే ఈమారు కూడా అతనిని అరవిందుల వారి దర్శనం లభించలేదు. బసచేయడానికి చోటు వెదికాడు. అది కూడా లభ్యం కాలేదు.

కాబట్టి ఇక అక్కడుండి చేయగలిగినదేమీ లేక తిరువణ్ణామలైకి వచ్చాడు. రమణాశ్రమంలో బసచేయ డానికి గదినిచ్చారు. కానీ ఆశ్రమమెందుకో కాస్త కళా విహీనంగా కనిపించింది. ఎందుకిలా అని విచారించగా రాచకురుపు రమణుల వారి ఎడమచేతికి సోకి ఆ చేయి బలహీనమైపోయింది' అని తెలిపారు.

గతంలోలా ఎప్పుడైనా రమణ మహర్షిగారిని దర్శించుకునే అవకాశం ఇప్పుడు లేకపోయింది. ఉదయంపూట కొద్దిసేపు, సాయంత్రం పూట కొద్దిసేపు మాత్రమే ఆయన దర్శనం లభిస్తుందని ఆశ్రమంలో ఒక నిబంధన ఏర్పరచారు

దర్శన సమయంలో రామ్సురత్ కున్వర్ భగవాన్ రమణులను చూశాడు. ఆయన ఎడమచేతికి పెద్ద కట్టు కట్టబడివుంది. శరీరం బలహీనంగా వున్నా ముఖంలో అదే తేజస్సు. ప్రకాశం. కనులు అందరినీ స్పృశిస్తున్నాయి ప్రతి ఒక్క వీక్షణమూ ఒక ఆశీర్వాదంగా భాసించేది. రామ్సురత్ కున్వర్ ను చూడగానే ఆయన ముఖంలో ఒక పెద్ద చిరునవ్వు వికసించింది.

రామ్ సురత్ కున్వర్ మనసులో ఆందోళన భగవాన్ స్థితిని తలచుకుని కంటనీరు చిప్పిల్లింది. కొద్ది సేపటిలో భగవాన్ విశ్రాంతి పొందడం కోసం దర్శన హాలు నుండి బయటకు రాగా యోగిరామ్ సురత్ కున్వర్ అరుణాచల పర్వతంపైకి వెళ్ళాడు. పర్వతశిఖరాగ్రాన ఒక బండపై కూర్చున్నాడు. రమణుల స్థితి గురించి ఆలోచించి వెక్కి వెక్కి ఏడుస్తూ చాలా సేపు అక్కడే గడిపాడు. తొలిసారిగా రమణులను దర్శించినప్పుడు ఆయన తనను చూసిన చూపు, ఆయన ఆశ్రమంలో ఉన్నప్పుడు చిక్కిన మనశ్శాంతి, స్పష్టత, అంతరంగంలోని తన్మయత్వం, ప్రశాంతత లాంటివే మరలా భగవాన్ ని చూడాలని ప్రేరేపించాయి. కానీ భగవాన్ అనారోగ్య స్థితిలో వున్నప్పుడు ఆయన అనుగ్రహం లభించడం, ఆయన వద్ద జ్ఞానసంపద పొందడం కఠినమైపోయాయి.

భగవాన్ రమణుల రాచపుండు ముదిరిపోయిన స్థితిలో ఏ సమయంలో ఏదైనా సంభవించవచ్చు అనే మాట ఆందోళనను కలిగిస్తోంది.

ఇన్నేళ్ళ తరువాత, తిరువణ్ణామలైలో ఒక మహితాత్ముడైన వ్యక్తిని దర్శించుకుని, మౌనస్థితిలో కూడా మనసులో ప్రకంపనలు కలిగించి, నాకు జ్ఞానమార్గాన్నిఅందించిన వీరిని మరలా కలవలేకపోవడం నన్ను చాలా వేదనకు గురిచేసింది" అని లోలోపల కుమిలిపోయాడు రామ్ సురత్ కున్వర్ సాయంత్రం పూట మరలా రమణులను దర్శించు కున్నాడు. మహర్షి కనులు వెలుగుతూ వున్నాయి. రామ్ సురత్ కున్వర్ ను చూసి మహర్షిగారి పెదాలు ఒక విచిత్ర మందహాసంతో వికసించాయి.

రామ్ సురత్ కున్వర్ తన దేహం, మనసు, జ్ఞానం ఇలా అన్నీ చెల్లాచెదరైపోవడం, రమణుల అనుగ్రహం తనను పూర్తిగా ఆవరించుకోవడం లాంటి భావనలను పొందాడు రామ్ సురత్ కున్వర్లో తీయని ప్రకంపనలు. ఒక పరవశత్వం, ఒక జ్ఞాపకం, మహర్షిగారి ఒక్క చూపు అంతరంగాన్నంతా ఆక్రమించుకుని మనసంతా పవిత్రమైన భావన కలిగింది. తనను గురువుగారి పాదాల చెంత సమర్పించుకున్నాడు. దీని ఫలితంగా మనసులో ఒక పరివర్తన ఏర్పడింది.

మనసును ప్రశాంతత పూర్తిగా ఆక్రమించు కున్నది. ఆశ్రమంలో బసచేసిన ఆ రోజుల్లో రమణుల వారిని సదా దర్శించుకుంటూ ఉన్నాడు. కాలక్రమేణా రమణులు దర్శనమిచ్చే సమయం తగ్గిపోయింది ఆయనను దూరం నుండే చూసి నమస్కరించుకుని వెళ్లి పోవాలన్న కట్టుబాటు ఏర్పడింది.

రామ్సురత్ కున్వర్ ఆయనను దూరం నుండే చూసి నమస్కరించారు. పర్వతాన్ని ఎక్కి అక్కడి గుహలో ధ్యానం చేసుకుంటున్న ఎందరో సాధువులకు నమస్క రించుకున్నాడు. ఇప్పుడు అరవిందులవారి దర్శనం లభిస్తున్నదని తెలిసి పుదుచ్చేరి బయలుదేరాడు. ఆయనను దూరం నుంచే చూసే భాగ్యం కలిగింది. ఆయన తనను కూడా గమనించారన్న భావన రామ్ సురత్కున్వర్కు కలిగింది.

మరలా తిరువణ్ణామలైకు వచ్చి రమణులను దర్శించుకుని, తక్కిన సమయాలలో అక్కడి సాధువులతో సత్సంగం జరిపేవాడు.

అలా సత్సంగం జరిపే సమయంలో ఒక సాధువ రామ్ సురత్ కున్వర్తో కేరళలోని కంచన్ గాడ్ అనే ప్రదేశంలో పప్పారామ్దాస్ అనే మహాత్ముడు ఉన్నారని తెలుపగా, ఆయనను చూడడానికి బయలుదేరాడు కంచన్ గాడ్ 'ఆనందాశ్రమం'లో పప్పారామ్ దాస్ నివసిస్తున్నారని తెలిసింది. అక్కడి ఆశ్రమవాసులు ఆయనకు అక్కడ బస ఏర్పాటు చేశారు.

పప్పారామ్ దాస్ ఆశ్రమంలోని ఒక పెద్ద సోఫాలో సుఖంగా కూర్చుని దర్శనమిస్తూ వున్నారు. ఆయనను ఎందరో భక్తులు పరివేష్టించి రామనామ సంకీర్తన చేస్తూ వున్నారు.

రామ్దాస్ వున్న చోటుకి కృష్ణాబాయి మాతాజీ వచ్చి రామదాస్తో ఏదో చెప్పగా, రామదాస్ చిరునవ్వుతో ఆ మాటలు విని బదులిచ్చారు. అది విని కృష్ణాబాయి మాతాజీ కూడా నవ్వారు.

అక్కడున్నవారు కొంకిణి, మలయాళం, తమిళం, కన్నడం భాషలలో మాట్లాడుకుంటుండగా రామ్సురత్ కున్వర్ కు ఏదీ అర్థం కాలేదు. కానీ అందరినీ సరదాగా వినోదంగా గమనిస్తూ వున్నాడు మహాత్ములంటే ముఖాన్ని గంభీరంగా చేసుకుని ప్రతివారినీ సూక్షమంగా అవలోకిస్తుంటారనే అపనిందను పప్పారామ్ దాస్ పోగొట్టారు. అందరితోనూ సహజంగా చనువుగా మాట్లాడేవారు. చమత్కారంగా జోక్ చేసేవారు. సరదాగా, ప్రేమగా, అందరితో మాట్లాడుతూ చనువుగా వ్యవహరించేవారు.

ఆయన ప్రవర్తన రామ్ సురత్ కున్వర్కు ఆశ్చ ర్యంగా ఉండేది. ఆశ్రమంలో ఆయనకు ఆదరణ బాగుండేది.

రామ్ సురత్ కున్వర్ అంటే ఏమిటి అర్థం?" అని ప్పా రామ్దాస్ అడుగగా "రాముని ప్రేమించే బిడ్డ" అని బదులిచ్చాడు.

పప్పారామ్దాస్ తన మాటలను కొనసాగించారు. రామ్సురత్ కున్వర్ ఏ వృత్తిలో వున్నారు? ఎక్కడ పనిబ్లాక్ చేస్తున్నారు. ఎందరు కుటుంబ సభ్యులు?" అని అడిగారు. అన్ని ప్రశ్నలకు రామ్ సురత్ కుమార్ బదులిచ్చి అక్కడ ఉన్నన్ని రోజులూ రామనామ జపం చేసూ తరువాత మరలా తిరువణ్ణామలైకి వచ్చాడు. రమణ మహర్షికి సాష్టాంగ ప్రణామం ఆచరించాడు.

ఆ సమయంలో రామ్ సురత్కున్వర్ తానిక తిరువణ్ణామలైలో ఉండడం సాధ్యంకాదు. దహియాకు వెళ్ళాలని తీర్మానించు కున్నాడు.

ఈ జరిగిన సంఘటనలు తలచుకుంటూనే అక్కడి పాఠశాలలో ఉద్యోగం చేయాలి. భార్యకు భర్తగా, పిల్లలకు తండ్రిగా తన కుటుంబ బాధ్యతలు నిర్వర్తించాలి అని భావించాడు.

ఊరికి వెళ్ళాడు. మనసు నిండా తాను దర్శించిన మహాత్ముల రూపాలను నింపుకున్నాడు. లోలోన ఆధ్మాత్మికత. వెలుపల ఉద్యోగ బాధ్యత, ఇలా జోడు గుర్రాల స్వారీ చేస్తూ కొద్దిసేపు సంతోషాన్నీ, మరో వైపు దుఃఖాన్ని అనుభవిస్తూ కర్తవ్యనిర్వహణ గావిస్తున్నాడు పరమాత్మను అన్వేషించడానికీ, చేతిలో పైసలు ఉండడానికీ ఎలాంటి సంబంధమూ లేదు అని భావించిన రామ్ సురత్ కున్వర్ వీలైనంత వరకూ తన చేత డబ్బు లేకుండా చూసుకునేవాడు.

డబ్బును ఆదా చేయాలనుకున్న అలవాటును త్యజించాడు. ఎప్పుడైనా తన అవసరానికి మించి డబ్బు లభిస్తే దానిని తల్లిదండ్రులకు పంపేసేవాడు. ఆడ పిల్లల పెళ్ళిళ్లు చేయడానికి వారికి రామ్ సురత్ కున్వర్ పంపిన డబ్బు ఉపయోగకరంగా వుండేది.

ఎవరు తనను ఏమడిగినా చేతిలో ఉండేదాన్ని వారికి దానంగా ఇచ్చేవాడు రామ్ సురత్ కున్వర్ భగవదన్వేషణలో వున్నవారికి స్వార్థపరత్వం అవసరం లేదు అని భావించాడు. ముంగిట నిలిచి 'అమ్మా అకల' అని ఎవరైనా అడిగితే ఇంట్లో వున్నదాన్ని ఇచ్చేయ మని భార్యకు చెప్పేవాడు పిల్లల కోసం వండిన అన్నం మాత్రమే వుంది. అని భార్య చెబితే తను సేవించే పాలు, పళ్ళను యాచకు
లకు ఇచ్చేసేవాడు. తను మాత్రం పస్తులు పడుకునేవాడు తను ఆనందాశ్రమంలో తీసుకున్న పప్పారామ్ దాస్ రాసిన 'ఇన్ క్వెస్ట్ ఆఫ్ గాడ్' అనే పుస్తకాన్ని చదవనారంభించాడు

పప్పారామదాస్ సుఖంగా వున్న ఒక మహాత్ముడు ఆయన సకల సౌఖ్యాలతోనూ జీవిస్తున్నాడు అనే భావన రామ్సురత్ కున్వర్ కు కలిగింది. ఆ భావన పుస్తకాన్ని చదవగా దగ్గమైపోయింది.

ఎంతో ఉన్నత పదవిలో, ఎన్నో సంపదలతో జీవిం చిన రామదాస్ వాటిని వద్దనుకుని కేవలం పాదచారిగా భారతదేశమంతటా సంచరించి, ఎన్నో కష్టాలను అధిగ మించి, తనను తీర్చిదిద్దుకున్న తరువాతే ఆయనకు భగవద్దర్శనం లభించిందన్న విషయం ఆ పుస్తకాన్ని చదివితే రామ్సురత్ కున్వర్ కు తెలియవచ్చింది. దాని ఫలితంగా మరలా ఆయనను దర్శించుకోవాలన్న తపన కలిగింది.

వ సంవత్సరంలో మూడవసారి రామ్ సురత్ కున్వర్ కు ఒక కుమార్తె జన్మించి, ఆ పాపకు మాయా' అనే పేరు పెట్టారు. ఆ సంవత్సరమే అరవిందులు, రమణమహర్షి సిద్ధి పొందారన్న విషయం అతనికి తెలిసింది నేను అనాథనయినాను' అని నర్గారా గ్రామంలోని పాఠశాలలో ఒంటరిగా కూర్చుని దుఃఖించాడు రామ్
సురత్ కున్వర్ నాకిదేం పరీక్ష? నేనింకా పరిపక్వ స్థితికే రాలేదు నేనింక ఆధ్యాయాత్మికంగా ఎదగలేనా? నేను ఎవరిని కలుసుకున్నా వారు నన్ను వదిలిపోతున్నారే'.

గురువు అంటే మార్గదర్శి. చీకటినుండి వెలుగుకు తీసుకువచ్చేవాడని అర్థం కదా! నేను చీకటిలోనే అలమ టించడం కోసం జన్మించానా? నాకు గురువు దొరకాలంటే నేనేం చేయాలి తిరువణ్ణామలైకు వెళ్ళి నేను ఏం చేస్తాను. ఎవరిని చూస్తాను. ఎక్కడ కూర్చోను. ఏమని అడగను నాకేమీ తోచడం లేదే" అని లోలోన కుమిలిపోయాడు. ఆ సంవత్సరం రామ్ సురత్ కున్వర్ హిమాలయా లకు వెళ్ళారు. అక్కడి పర్వతాలలో మానససరోవర్ గంగోత్రి, యమునోత్రి, కైలాష్ లాంటి అనేక పుణ్య క్షేత్రా లను తిరిగి చూసి, ఎన్నో పవిత్ర నదులలో స్నానమాచ రించి ఎందరో సాధువులను దర్శించుకుని తిరిగి వచ్చాడు.

భగవంతుని స్థాయికి ఎదిగిన గురువే తనకు భగవంతుని చూపించగలడు. గురువు వలన మాత్రమే ఒక మనిషిని భగవంతుని స్థాయికి తీసుకు వెళ్ళడం సాధ్యం, అనే విషయాన్ని రామ్సురత్ కున్వర్ ప్రగాఢంగా విశ్వసించారు.

తరువాతి సంవత్సరం ఎలాగైనా పప్పా రామ దాస్ ను చూడాలని వేసవిలో ఆనందాశ్రమానికి వెళ్ళాడు ఈ మారు కూడా ఆయన పట్ల సంపూర్తిగా సద్భావన కలుగలేదు. పప్పారామదాస్ వ్యక్తిత్వం రామ్ సురత్ కున్వర్ ను ఆకట్టుకోలేదు. "ఈ బిచ్చగానికి తన పూర్తి అంతరంగాన్ని పప్పారామదాస్ బహిర్గతం చేయలేదు ఆ అర్హత ఈ బిచ్చగానికి ఇంకా రాలేదు కాబట్టి ఆయన ఈ విషయాన్ని వాయిదా వేస్తున్నారేమో" అని భావిం చాడు.

వేసవిలో భారతదేశంలోని ఎన్నో ప్రదేశాలలో పర్యటించాడు. ఎందరో సాధువులను దర్శించుకున్నాడు లోపల దాగివున్న పరమాత్మను బయటి ప్రపంచంలో వెదికే ప్రయత్నం చేశాడు భార్య రంజనాదేవి నాలుగవ బిడగా 'మీనా' అనే కుమార్తెకు జన్మనిచ్చింది. కుటుంబ బాధ్యతలు పెరిగాయి. అలాగే భగదన్వేషణపై ఆసక్తి కూడా పెరిగిపోయింది. ఆగస్ట్ నెల 'భగవంతుని అన్వేషణలో ముఖ్యమైన తీర్మానాలను తీసుకోవలసిన సమయం ఆసన్నమైంది. అనవసరంగా కాలయాపన అవుతోంది అని గ్రహించి, సెలవురోజులలో ఆనందాశ్రమానికి వెళ్ళాడు.

ఆనందాశ్రమం అతనిని సాదరంగా ఆహ్వా నిం చింది. అక్కడ పప్పారామదాస్ ప్రధాన శిష్యుడు సచ్చిదానంద ఉన్నాడు. అతను రామ్ సురత్కున్వర్ను చక్కగా ఆదరించాడు అతనితో రామసురత్ కున్వర్ నాకు దీక్ష నిప్పించమని పప్పా రామదాస్గారితో చెప్పండి" అని అడిగాడు దానికీ తగిన సమయం వస్తుంది. ఆయనను అనుసరిస్తూ వుండు. కచ్చితంగా నీ కోరిక నెరవేరుతుంది" అన్నాడు సచ్చిదానంద.

పప్పా రామదాస్ ఎక్కడికి వెళ్ళినా రామ్ సురత్ కుస్వర్ ఆయన వెంట వెళ్ళేవాడు. 'ఏదైనా శుభతరుణం రాదా, నాకు ఆయన దీక్ష ఇవ్వరా' అని సదా తపిసూ వుండేవాడు రామ్ సురత్ కున్వర్.

ఎన్నో ప్రదేశాలలో సంచరించినా, పప్పా రామదాస్ తోను నోరు విప్పి 'నాకు దీక్షనిప్పించండి' అని అడిగే ధైర్యం రామ్ సురత్ కున్వర్ కు రాలేదు. ఆయన మరచిపోతారేమోనన్న భయం కూడా లేకపోలేదు,
ఇప్పుడు కాదు. ఆ తర్వాత ' అంటారేమోనన్న ఆందోళన అలా చెప్పేశారంటే ఇక మరోమారు అడిగే అవకాశం లేక ఇంటికి తిరిగిపోవాల్సిందేనా అన్న దిగులు కూడా ఒకవేళ తన ఈ కోరిక నెరవేరకుండానే తను మరణిస్తే...' అనే చింత కూడా కలిగింది. ఏది ఏమైనా ఆయనను అనుసరించడం మాత్రం మానలేదు.

ఒక రోజు ఒక నిర్దిష్ట ప్రదేశంలో 'ఇవాళ ఆయనను అడిగేద్దాం'. అనుకుని పప్పారామదాస్గారికి రెండడుగులు దూరంలోకి వచ్చేశాడు. అప్పుడు పప్పా రామదాస్ హఠాత్తుగా వెనక్కి తిరిగి "నీకు దీక్షనివ వలసిందిగా రామదాస్ ను అడగబోతున్నావా; రామదాస్ నీకు దీక్షనివ్వాలని కోరుకుంటున్నావా?" అన్నారు. బిగ్గరగా దేనిని నిరీక్షించి ఇంత కాలం ఆయన వెంట తిరిగాడో అదే అవకాశం తనను వెతుక్కుంటూ వచ్చింది.

పప్పారామదాస్ 'నేను నీకు దీక్ష నివ్వాలని కోరుకుంటున్నావా?' అని అడగగానే రామ్సురత్ కున్వర్ పొందిన ఆనందానికి అంతే లేదు. 'అవును' అని తలాడించాడు. కూర్చో' అని ఆజ్ఞాపించారు పప్పారామదాస్ రామ్ సురత్ కున్వర్ కూర్చున్నాడు. అతని కెదురుగా పప్పా రామదాస్ కూర్చున్నారు. 'రామదాస్ చెప్పిన దానినే మరలా చెప్పు' అంటూ ఆయన “ఓం శ్రీ రాంజయరాం జయజయరాం' అన్న మంత్రాన్ని మూడుసార్లు ఉచ్చరించారు.

పప్పారామదాస్ చెప్పిన ఆ మంత్రం కేవలం ఒక వాక్యం మాత్రమే కాదు. అది రామమంత్రం కాదు. రామబాణంలా రామ్సురత్కున్వర్ హృదయాంతరాళం లోకి చొచ్చుకుపోయింది. రామ్ సురత్ కున్వర్ ఆ మంత్రాన్ని ఏకాగ్రతతో పదేపదే ఉచ్చరించాడు. పప్పారామదాస్, రామ్ సురత్ కున్వర్ శిరస్సుపై చేతినుంచి వెళ్లు! ఈ మంత్రాన్ని ఇరవైనాలుగు గంటలూ పారాయణం చేయి” అని చెప్పి వెళ్ళిపోయారు.

మంత్రంలో గురువుగారి పరమానుగ్రహం కలిసి వుంది. రామ్సురత్ కున్వర్ ఆ అనుగ్రహాన్ని భరించలేక తపించిపోయాడు. లేచి నిలబడలేకపోయాడు. శరీరం కంపించి పోయింది. హృదయం బద్దలయిపోతుందేమో అనిపించింది. తల భారమైంది. కళ్ళు బరువైనాయి శరీరం పడిపోయేలా వుంది.

లేచిపక్కనున్న గోడను పట్టుకుని నిలబడ్డాడు తనలోకి ఏదో శక్తి ప్రవేశించినట్లయింది. దుఃఖించాడు ఎందుకీ దుఖం, తెలియదు. అక్కడున్నవారందరూ తమతమ విధులను నిర్వ హిస్తూ వున్నారు. రామ్సురత్ కున్వర్ దిగ్రమ చెందినట్లుగా నెమ్మదిగా అడుగులు వేశాడు. గాలిలో కొట్టుకుపోయే గడ్డిపరకలా అయిపోయారు.

ఆశ్రమానికి దగ్గరలో ఒక చిన్న పర్వతం వున్నది. దాని క్రింది భాగంలో నిలబడ్డాడు. తలెత్తిపైకి చూశాడు. దానిపైకి ఎక్కాడు. దానిపైన ఒక నల్లని పలక ఉన్నది. దానిపై కూర్చున్నాడు. సూర్యుని వేడి దహిస్తోంది. నెమ్మదిగా సూర్యుడు ఆకాశంలో పశ్చిమ సముద్రం లోకి దిగిపోయాడు. రామ్ సురత్ కున్వర్ సూర్యుని, భూమిని సముద్రాన్ని అలా చూస్తూ వుండిపోయాడు.

నేనెందుకిలా వున్నాను ఎందుకిలా జరుగు తోంది. లోలోపల నాకేమవుతోంది?' ఈ ప్రశ్నలలో దేనికీ సమాధానం దొరకడం లేదు. కానీ ప్రశ్నలు మాత్రం తన ఎదుట విశ్వరూపం ధరించి కనబడుతున్నట్లుగా అనిపిస్తోంది.

ఆ నల్లని పలకపై వెల్లకిలా పడుకుని ఆకాశాన్ని చూశాడు. చీకట్లు కమ్ముకున్నాయి. నక్షత్రాలు ప్రకా శిస్తున్నాయి. గాలి స్తంభించి లేచి కూర్చున్నారు. నోరువిప్పి బిగ్గగా ఏడ్చారు. హఠాత్తుగా అతనిపై ఆనందపు జల్లు కురిసి నవ్వాడు. అన్ని రకాల భావనలూ మాయమైనాయి అపూర్వమైన ప్రశాంతత నెలకొన్నది.

ఏదో ఒక ధ్వని ప్రకంపన తనను సోకినట్లు అనిపించింది. ఎవరో తనతో ఏదో పలికినట్లయింది కానీ చుట్టు ప్రక్కల ఎవరూ లేరు. పర్వత శిఖరం. తాను ఒంటరిగా వున్నాడు. అయినా ఏదో శబ్దం వినబడుతోంది ఏమిటది.

ఆ శబ్దంవైపునకు మనసును కేంద్రీకరించాడు చాలా బలహీనంగా వున్న దానిని సరిగ్గా వినలేక పోయాడు. మరీ సూక్ష్మంగా గమనిస్తూ వుండగా క్రమంగా ఆ ధ్వని ఇప్పుడు స్పష్టంగా వినిపించనారంభించింది ఆ ధ్వని బయటినుండి రావడం లేదు. అది లోపలి నుండి వస్తున్నది. తన హృదయం లోతుల్లో నుండి వస్తూ వుంది. చెవియొగ్గి విన్నాడు.

ఓం శ్రీరాం జయరాం జయజయరాం'

ఆ మంత్రధ్వని రానురాను బిగ్గరగా వినవస్తోంది. దాని ప్రకంపనల వలన అతడి శరీరమే కదలిపోతోంది ఆ మంత్రధ్వని అతనిని అన్ని వైపులా ఆవరించుకుని వుంది. అతనిని ఉన్మత్తుని చేస్తూ వుంది. ఆ ధ్వని తీవ్రతను తట్టుకోలేక బిగ్గరగా నవ్వాడు. ఏంచేయాలో తెలియడు. కానీ అన్ని భావనలూ అతనిలోనుండి వెలువడు తున్నాయి- అతనికి తెలియకుండానే నక్షత్రాలు, చందమామ గగనంలో ప్రకాశిస్తుం డగా రాత్రంతా అతను అదే స్థితిలో ఉండిపోయాడు తెల్లవారింది. పర్వతశిఖరం నుండి మంత్రాన్ని బిగ్గరగా ఉచ్చరిస్తూ క్రిందికి దిగి వచ్చాడు. ఆశ్రమంలోకి ప్రవేశించాడు. ఒక కొబ్బరి చెట్టు దగ్గర వెళ్లి 'రాంరాం అన్నాడు. మరో చెట్టుదగ్గరకి వెళ్లి 'రాంరాం' అన్నాడు అటు పురుగెత్తాడు. ఇటు పరుగెత్తాడు. చిందు లేస్తూ రామనామాన్ని పలికాడు. కూర్చుని పలికాడు బిగ్గరగా అరిచాడు. తినక, స్నానం చేయక రామనామం పలికాడు. ఆశ్రమంలోని మూలమూలలకూ వెళ్లి రామ నామాన్ని పలికాడు.

అతని ప్రవర్తనకు ఆశ్రమవాసులు కంగారు పడ్డారు. ఒక ఉన్మాదిలా కనిపించిన అతడిని సాంత్వన పరిచే ప్రయత్నం గావించారు. సచ్చిదానందస్వామి అతనికి భోజనం అందించే ప్రయత్నం చేసినపుడు రామ్సురత్ కున్వర్ దానిని స్వీకరించలేదు.

అతని ప్రవర్తన ఆశ్రమవాసులకు కాస్త ఇబ్బంది కలిగించింది. అతనికి ఏదైనా జరిగితే ఆశ్రమం బాధ్యత వహించాల్సి వుంటుంది కదా అతనిని పప్పారామదాస్ వద్దకు పిల్చుకుని వెళ్ళారు. అతని స్థితిని చూసిన పప్పారామదాస్ చాలా ఆనందించారు. శిష్యుని భగవదన్వేషణా ప్రయత్నం సఫలమైందని తెలుసుకున్నారు. బిగ్గరగా నవ్వారు.

అతనిని ఆశ్రమంలోనే ఉంచేసుకుంటే అతని మహిమలు ప్రపంచానికి తెలియకుండా పోతాయని భావించారాయన.

ఆయన రామ్సురత్ కున్వర్ మీరిక్కడ ఉండడానికి వీలులేదు. ఎక్కడికి వెళతారు?" అని అడిగారు కానీ మరెక్కడికో పోవడానికి రామ్ సురత్ కున్వర్కు ఇష్టం లేదు.

గురువుగారి సన్నిధిని వదలిపోవడం అతనికి సాధ్యం కాదు. ఆశ్రమంలోనే సంచరిస్తూ వున్నాడు అక్కడివారు అతడిని మందలించారు. కానీ అతని ఉన్మత్తత ఉపశమించలేదు. బయటికి వెళ్లిపోవాలని కఠినంగా ఆదేశించారు. అలా చెప్పినా అతను కదలలేదు.

అప్పుడు రామదాస్ అతడిని "నువ్వొక పిచ్చి వాడివి" అని దూషించారు. భక్తుల బృందాలు వచ్చినపుడు వారి ఎదుట అతడిని ఎడాపెడా తిట్టి, అతని అహం కారాన్ని విమర్శించారు. 'బయటికిపో' అని ఆశ్రమం నుండి తరిమేశారు. కానీ రామ్ సురత్ కున్వర్ బయటికి పోవడానికి నిరాకరించాడు. ఆశ్రమవాసులు మరోదారిలేక అతనిని బలవంతంగా బయటికి పంపించారు.

భగవదన్వేషణ అనేది కష్టంతో, బాధతో కూడుకున్న మార్గం. అతని మానావమానాలు అక్కడ ఛిన్నా భిన్నమై పోయాయి. నిరంతం రామనామం చెబుతూనే ఆశ్రమాన్ని వదలి బయటికి నడిచాడు రామ్ సురత్ కున్వర్ ఆనందాశ్రమం రామ్ సురత్ కున్వర్ను బయటికి పంపిన విధానం కాస్తంత క్రూరంగా అనిపించినా వాస్తవానికి అదే సరైన పద్ధతి.

రామ్సురత్ కున్వర్ గురువుగారి దీక్షవలన పరవశ స్థితికి పంపబడి ఉన్మాదం పట్టినవాడిలా, చేష్టలు ఉడిగిన వాడిలా ప్రాపంచిక జీవనానికి లోనుగాకుండా ఉండి పోయాడు.

భగవంతుని అన్వేషించే ప్రతి ఒక్కరూ ఈ స్థితిని దాటడం తప్పనిసరి. పైగా ఒక మర్రి వృక్షం నీడలో మరో వృక్షం పెరగడం సాధ్యం కాదు. మర్రిచెట్టు బీజం బయలు ప్రదేశంలో ఇతర ృక్షాలు లేనిచోట పడినపుడే మరో మహావృక్షంగా ఎదగడం సాధ్యం ఆ బీజం మొలకెత్తి, మొక్కై వృక్షమై బ్రహ్మాండంగా ఎదగడానికి తగిన అవకాశాలూ, పరిసరాలు కావాలి ఒక మహా వృక్షం నీడలో పెరిగే మరో వృక్షం ఎక్కువకాలం జీవించలేదు.

దక్షత, సామర్థ్యం, భక్తిభావాలూ దృఢంగా వున్న రామ్సురత్ కున్వర్ను బయటి ప్రపంచం వెలుగులోనికి తీసుకువస్తేనే, అతడు ఒంటరిగా వుంటేనే మరో మహిమా న్వితుడిగా వెలుగొందడం సాధ్యం. అప్పుడే మరింతగా అతనిలో మానసిక పరిపక్వయత కలుగుతుంది.

కట్టుబాట్లను అనుసరించే ఉత్తమజీవనం, కట్టుబాట్లే లేకుండా దైవాన్వేషణ కోసం అర్రులు చాచేవారికి పట్టుబడదు. అది డైవాన్ని అన్వేషించేవారినీ నెమ్మదిగా ఉండనీయదు. చుట్టు ప్రక్కలవారికి భయ భ్రాంతులను కలుగజేస్తుంది. ఇది చాలా సక్లిష్ట స్థితి మహానుభావులందరూ ఈ కఠినమైన స్థితికి లోనైనవారే ఆనందాశ్రమం నుండి బయటికి పంపబడిన రామ్సురత్ కున్వర్ దారీతెన్నూ లేనివాడిలా తిరువణ్ణ మలైకు వెళ్ళారు. అక్కడ మూడు వారాలపాటు తిరిగాడు మరలా ఆనందాశ్రమానికి వెళ్ళిపోవాలన్న తపన అతడిని వేటకుక్కలా తరిమింది. అక్కడికెళ్ళి ప్రాధేయపడితే లోనికి వదలుతారా అనే సంకోచంతోనే ఆనందాశ్రమానికి వెళ్లడానికి కేరళకు వెళ్లే రైలు ఎక్కారు.

ఈరోడ్ రైలు స్టేషన్లో తన శరీరంపై స్పృహలేని స్థితిలో వున్న అతడిని ఒక రైలింజన్ ఢీకొన్నది. దాని ఫలితంగా ఎడమచేతి ఎముకలు విరిగాయి. ఎడమకాలికి గాయాలయ్యాయి. అక్కడివారు ఎవరో అతనిని ఈరోడ్ ఆస్పత్రిలో చేర్పించారు. అక్కడే రెండు నెలలపాటు చికిత్స పొందాడు. అక్కడ ఒక గుజరాతీయుల కుటుంబం ఇతనితో మాట్లాడి, ఇంటికి కబురు పంపారు. రామ్ సురత్ కున్వర్ గారి మిత్రులిద్దరూ వచ్చి అతనిని అతని అత్తగారి ఊరైన దహియాకు తీసుకు వెళ్ళారు.

కానీ అతను అత్తగారింటికి వెళ్లలేదు. ఉపాధ్యాయ వృత్తికీ పోలేదు. పలక్ నదీతీరంలో తిరిగాడు. వీధులలో సంచరించాడు. అక్కడే విశ్రమించాడు.

ప్రతిక్షణమూ 'జయజయరాం' అని రామ నామాన్ని ఉచ్చరిస్తూ వుండేవారు. ఎవరైనా అతనితో మాట్లాడడానికి వస్తే 'జయజయరాం' అని అరుస్తూ బిగ్గరగా నవ్వుతుండడంతో వచ్చినవారు పారిపోయేవారు ఎవరైనా పాలూ, అరటిపళ్లు ఇస్తే స్వీకరించేవాడు అంతవరకూ ధూమపానం చేసి ఎరుగని అతడు బీడీ సిగరెట్లను పీల్చడం ఆరంభించాడు.

అతని బావమరుదులు అతనికి పిచ్చిపట్టిందని మానసిక చికిత్సాలయంలో చేర్చారు. రెండురోజులపాటు అతనిని పరీక్షించి చూసిన మానసిక వైద్యులు అతని మనఃస్థితి బాగుందని తెలిపారు. "మీకేమైంది? అసలు మీకేం కావాలి?" అని అతదిని బావమరుదులు అడగ్గా తను తన గురుదేవులను చూడాలనుకుంటున్నానని తెలిపాడు రామ్సురత్ కున్వర్.

వెళ్లేటప్పుడు నీ కుటుంబాన్ని కూడా నీ వెంట తీసుకుపో! వాళ్లను ఇక్కడెందుకు వదలిపోతావు?" అని బంధువులు అతడిని అడిగారు.

రామ్ సురత్ కున్వర్ భార్యాపిల్లలతో ఆనందాశ్రమా నికి వెళ్లాలని తీర్మానించుకున్నాడు. రామ్ రంజనీదేవి భర్తతో వెళ్లడానికి సిద్ధపడింది. పెద్ద పిల్లలను వారితో పంపడానికి మరుదులు ఇష్టపడలేదు.

రామ్ సురత్ కున్వర్ భార్యతో ఐదేళ్ల కుమార్తె మాయా, రెండేళ్ల మీనాతో ఆనందాశ్రమానికి వెళ్లాడు ఆశ్రమంలో ఏదో ఒక పనిచేసుకుంటూ శేషజీవితాన్నిఅక్కడ గడుపుతాము. అందుకు అనుమతించవలసిందని ప్పారామ్దాస్ ను ప్రాధేయపడ్డాడు.

కానీ అందుకు పప్పారామ్దాస్ అంగీకరించలేదు రామ్ సురత్ కున్వర్ కంటిలో నీరు. "పప్పా! నన్నూ నా కుటుంబాన్నీ ఇక్కడ ఉండనిస్తారన్న నమ్మకంతో ఇక్కడికి వచ్చాము. మీరే నాకు ఆరశ్రయమివ్వకపోతే మేము ఎక్కడికి వెళ్ళగలము.

మీరు ఏ క్షణంలో నా హృదయంలో ఆధ్మాత్మిక భావనలను ప్రేరేపించారో, ఆ క్షణం నుంచీ నేను స్థిరచిత్తంతో ఉండలేకపోయాను. నాకూ, నా పిల్ల లకూ ఇక్కడ ఆశ్రయమివ్వండి" అని మొరపెట్టుకున్నాడు.

అప్పుడు పప్పారామ్దాస్ అతనితో “వెళ్లు! పోయి బిచ్చమెత్తుకో! ఒక మహావృక్షం నీడలో మరో వృక్షం ఎదగలేదు. ముళ్లచెట్లు, కలుపుమొక్కలు మాత్రమే అక్కడ పెరుగుతాయి" అని అతడిని తరిమేశారు.

రామ్సురత్ కున్వర్ స్తంభించిపోయాడు. “అన్నం కోసం నేను బిచ్చమెత్తాలా? నేను బిచ్చగాడినా పప్పా" అని అడిగాడు.

పప్పారామ్దాస్ బదులు చెప్పకుండా లోనికి వెళ్ళి పోయారు. భార్యాపిల్లలను తన పక్కనుంచుకుని విలపించారు రామ్ సురత్కున్వర్. 'బిచ్చగాడిని, బిచ్చగాడిని' అని తనలోతానే పలవరించాడు.

వఎలాగోలా భార్యాపిల్లలతో చెపన్నైకు వచ్చాడు. అక్కడి వీధులలో వచ్చిపోయేవారిని బిచ్చమడిగాడు కొద్దిగా డబ్బు వచ్చింది. ఆకలితో అలమటించే పిల్లలకు భోజనం ఇప్పించాడు.

మరలా రైలెక్కి ఊరికి వెళ్ళిపోయాడు. బావ మరుదుల వద్ద భార్యను, పిల్లలనూ వదలి మరలా అక్కడి నుండి బయలుదేరాడు.

ఎక్కడెక్కడో తిరిగాడు. అతనికి ఎలాంటి బరువు బాధ్యతలూ లేవు. చేతిలో చిల్లిగవ్వ లేదు. ఆకలి వేసి నప్పుడు బిచ్చమడిగేవాడు. కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకూ, ద్వారకనుండి పూరీ, హృషికేశ్, బదరీనాథ్ కేదార్ నాథ్ వరకూ భారతదేశమంతటా పర్యటించాడు.

మరలా స్వంత ఊరికి తిరిగి వెళ్ళాడు. పిల్లలను చూసి పొంగిపోయాడు. సంసారానికీ, సన్యాసానికీ ఎంత తేడా! ఎంతటి వైరుధ్యం భార్యను గురించి విచారించాడు. ఒక సీల స్వయం సేవా బృందంలో భార్యను చేర్చినట్లుగానూ, ఆమె అక్కడ శిక్షణ పొందుతున్నట్లుగానూ బావమరుదులు తెలిపారు. ఆమెకు శిక్షణ పూర్తిగానే ప్రభుత్వోద్యోగం లభిస్తుంది. దానిలో దొరికే జీతంతో పిల్లలను పోషించుకో వచ్చని తెలిసింది భార్య వున్న చోటుకి వెళ్లాడు. రామ్ సురత్ కున్వర్ ను చూసిన ఆ స్వయం సేవా బృంద అధికారి భార్య ఎదుటనే అతడిని నానామాటలూ అని తరిమేసింది ఆ అధికారి ఆయనను అంతలా తిట్టడానికే ముంది? "నువ్వూ ఒక మగాడివేనా?" అని కదా తిట్టి వుంటుంది. రామ్ సురత్ కున్వర్ ఆమె మాటలు విని తల్లడిల్లిపోయాడు. అతని భార్య కూడా తన ఎదుట భర్త ఇలా నానామాటలు పడవలసివచ్చిందే అని బాధతో కన్నీరు కార్చి వుంటుంది.

ఇంతటి సంక్లిష్టపరిస్థితిలో అతడు ఒక దృఢ నిర్ణయాన్ని తీసుకున్నాడు. భార్యకంటూ ఒక ఉపాధి మార్గం లభించింది. నేనెందుకు తనను ఇబ్బంది పెట్టాలి ఆ చోటు నుండి బయలుదేరాడు. ఆ తరువాత కొన్ని రోజులు గడిచాకనే భార్యను కలుసుకున్నాడు.

ఎన్నో ఊర్లు తిరిగితిరిగి చివరగా తిరువణ్ణామలై చేరుకున్నాడు. పొన్నచెట్టు క్రింద, రావిచెట్టు క్రింద, కొండ గుహలలో ఇలా ఎక్కడ వీలైతే అక్కడ ఉండేవాడు.

రమణాశ్రమంలోనూ, శేషాద్రిస్వామి ఆశ్రమం లోనూ సాధువులకు ఇచ్చే ఆహారాన్ని స్వీకరించాడు. ఒక కొబ్బరి చిప్పలో నీరుపట్టుకుని త్రాగేవాడు. దానినే బిచ్చమడగడానికి పాత్రగా వాడుకున్నాడు తిరువణ్ణామలైలో ఎండ తీవ్రత ఎక్కువ. ఉక్కపోతను తట్టుకునేందుకు ఒక తాటాకు విసనకర్ర. ఈ రెంటినీ ఎలాగో సంపాదించుకున్నాడు. ఈ రెంటినీ తన వద్దనే ఉంచుకున్నాడు.

అతని ఉన్మాదం ఏకముఖంగా ఉన్నది. భగవం తుడు తనను సంపూర్తిగా ఆక్రమించుకున్నాడన్న విషయాన్ని క్రమంగా గ్రహించాడు. ఆనాడే రామ్సురత్ కున్వర్ అన్న పేరుకు విరామం పడింది. లోపల భగవంతుని ఉనికి ఉన్నందువలన ఆ పేరు రామ్ సురత్ కుమార్ గా పరివర్తన చెందింది.

రామ్ సురత్ కుమార్ శరీరం బంగారు రంగుకు మారింది. ఆ శరీరం పవిత్రమైపోయింది. స్నానం చేయ డాన్ని మానేశారు. సంవత్సరానికి ఒకసారి స్నానం చేసే వారు. కాలక్రమాన దానిని కూడా మానేశారు రామ్ సురత్ కున్వర్ అనే నామధేయం గల వ్యక్తి ఆ శరీరం నుండి తొలగిపోయాడు. ఆ స్థానాన్ని ప్రపంచానికి తండ్రి అయినవాడు ఆక్రమించుకున్నాడు. లోపల బయట, ఇక్కడ, అక్కడా, అన్ని చోట్లా ఆయన భగవంతుని తప్ప ఎవరినీ చూడలేకపోయారు.

రమణమహర్షికి ఆప్తశిష్యులలో ఒకరు ఈయనను 'యోగి' అని ప్రేమగా పిలిచారు. నాటి నుండి .ఆయన 'యోగిరామ్ సురత్ కుమార్' అయినారు. చెన్నైలో 'థియోసాఫికల్ సొసైటీ' ఉందని తెలిసి యోగిరామ్ సురత్ కుమార్ అక్కడికి వెళ్ళారు. చెన్నైలోని అడయారు ప్రాంతంలో ఒక వినాయకుని దేవాలయంలో ఆరునెలలపాటు బసచేశారు. థియోసాఫికల్ సొసైటీ గ్రంథాలయానికి వెళ్లి అక్కడ జె. కృష్ణమూర్తి గారి పుస్తకాలను చదివారు.

ఆ సమయంలో థియోసాఫికల్ సొసైటీకి ప్రెసిడెంట్ గా వున్న బ్రదర్ శ్రీరామ్ యోగి రామ్ సురత్ కుమార్ లోని వ్యక్తిత్వాన్ని గుర్తించారు. తరువాత బ్రదర్ శ్రీరామ్ ట్రూమన్ అనబడే యూరోపియన్ వ్యక్తికి రామ్ సురత్ కుమార్ గారిని పరిచయం చేసి, ఆయన గురించి పుస్తకం రాయమని చెప్పారు.

Yogi RamSuratKumar- The God Child of Tiruvannamalai అనే శీర్షికతో రామ్ సురత్ కుమార్ గురించి ట్రూమన్ రాసిన తొలి పుస్తకం అదే

జె. కృష్ణమూర్తి సాధారణంగా డిసెంబర్ నెలలో భారతదేశానికి రావడం ఆనవాయితీ. ఒకసారి ఆయనను యోగిరామ్ సురత్ కుమార్ కలుసుకున్నారు. జె.కృష్ణమూర్తి యోగిరామ్సురత్ కుమార్ ఒకరి గురించి ఒకరు చక్కగా అవగాహన చేసుకోగలిగారు 965లో యోగిరామ్ సురత్ కుమార్ తిరువణ్ణామలైకి తిరిగివచ్చారు ఇప్పుడు ఆయనకు తన మార్గమేమిటో తనేం చేయాలో అనే విషయం స్పష్టంగా గోచరించింది ప్రజలను కలుసుకుని, వారి సంకటాలను తొలగించాలని తీర్మానించుకున్నారు.

కొద్దికొద్దిగా ఆయన కీర్తి ప్రతిష్టలు అంతటా వ్యాపించసాగాయి. ఆయనను దర్శించుకోవడానికి ప్రజలుక్రమంగా రాసాగారు. ఇతర రాష్ట్రాల నుంచీ, విదేశాల నుండీ ప్రజలు వచ్చి ఆయనను దర్శించుకునేవారు.

ఇతర గురుదేవుల వలెకాక, గొంతెత్తి ప్రసంగాలు చేయకుండా, జీవించడం ద్వారా ఆయన తానెవరు అనే విషయాన్ని ప్రకటించుకున్నారు. ప్రశాంతత, మౌనం ద్వారా తన శక్తిని ఇతరులకు వ్యాపింపచేశారు.

ప్రజలు కోరడానికి ముందే వరం లభించింది దూరంగా నిల్చుని చూడడం వలననే అనేక కష్టాలు తొలగాయి. కేవలం సిరిసంపదలు, వ్యాధుల, వేదనలు తొలగించి, ఆరోగ్యం, సంతానాభివృద్ధి, ఇల్లు, వాహనం లాంటివి మాత్రమే కాక, జ్ఞానాన్ని పొందడానికి కూడా వారి ఆశీర్వాదం కావాలని కోరుకోవచ్చు.

పైన చెప్పబడిన సంకటాలూ, అవస్థలూ ఆయన అనుగ్రహం వలన సులభంగా తొలగిపోతాయి. వాటిని తొలగించడం ద్వారా మన జ్ఞానార్జన అధికమవుతుంది. గురువుగారిపై నున్న విశ్వాసం దృఢమవుతుంది. దీని కోసమే ఈ ప్రయోజనాలు మనకు చేకూరుతాయి

77వ సంవత్సరం యోగిరామ్ సురత్ కుమార్ గారి భక్తుడొకరు దేవాలయ సమీపంలో సన్నిధివీధిలో ఒక ఇంటిని ఏర్పాటు చేశారు.

ఆయనను చూడడానికి భక్తులు రాసాగారు. తమ సమస్యలను ఆయనకు తెలిపి వాటికి పరిష్కారాలను సూచించమని అడిగేవారు. ప్రజల సమస్యలను ఆయన తీర్చేవారు.

93వ సంవత్సరం భక్తులు ఒక ఆశ్రమాన్ని కట్టాలన్న తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. యోగిరామ్ సురత్ కుమార్ వారి కోరికను మన్నించారు.

రమణాశ్రమం, శేషాద్రిస్వామి ఆశ్రమం సమీపంలో అగ్రహార కొల్లై అనే ప్రదేశంలో ఆశ్రమం నిర్మించబడింది.

ఆశ్రమంలో ప్రతి రోజు కనీసం యాభైమంది సాధువులకు విస్తళ్లు పరచి భోజనం వడ్డిస్తారు. అంతే కాదు. భక్తులకు అక్కడ అన్నదానం కూడా జరుగుతూ వుంటుంది. నేటి వరకూ కూడా అది కొనసాగుతూనే ఉంది.

రామకృష్ణపరమహంసగారినీ, రమణమహర్షి గారిని బాధించిన రాచపుండు యోగిరామ్ సురత్ కుమార్ గారికి ఆయన కర్మ ఫలితాన్ని ఇవ్వడానికి ఆయనపై దాడి చేసింది.

వ సంవత్సరం ఫిబ్రవరి 20 తెల్లవారు ఝాముున 3.19 గంటలకు యోగిరామ్సురత్ కుమార్ సిద్ధి పొందారు.

ఆయన సిద్ధి పొందినా కూడా మనకు కచ్చితంగా సాయపడతారు. మనకు గురువులా వుంటారు. మన జీవనవిధానాన్ని సరైన దిశగా నడుపుతారు.

ఈనాటికీ ఆయన తన అపారశక్తితో ప్రజల మధ్యనే ఉండి అనుగ్రహిస్తూ మానవజాతికి మార్గదర్శనం చేస్తూనే ఉన్నారు.

యోగిరామ్ సురత్ కుమార్
యోగిరామ్ సురత్ కుమార్
యోగిరామ్ సురత్కుమార్
జయ గురురాయా

ఏది జరిగినా, అది భగవంతుని కృపతోనే జరుగుతున్నది. అది నీకు అవసరమైనది. దానిని ఆశీర్వాదంగా స్వీకరించు.

- యోగిరామ్ సురత్ కుమార్

